రమానాథ్
శివ-శివాని పిక్చర్స్




ఆవుల శ్రీనాథ్

సంగీతం నరేంద్రనాథ్

JAGATI Rs. 2-00 Sept. 1991

36th Year of Publication




## సెప్టెంబరు - 1991

## సాహితీ సుధ

ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారు బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్ట శాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొక తఱిన్ యోగ్యాంబర శ్రేణి లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్

—భర్తృహరి

కొడుకుల్ పుట్ట రటంచు నేడ్తు రవివేకు ల్జీవన భ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రు కనేకుల్ వారిచే నే గతుల్
వడసెం, బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లె నే దుర్గతుల్ ?
చెడునే మోక్షపదంబ పుత్రునకున్ శ్రీ కాళహస్తీశ్వరా !

—ధూర్జటి

అనువుగాని చోట అధికుల మనరాదు - కొంచమయిన నదియు గొదవ కాదు
కొండ యద్దమందు గొంచమై యుండదా - విశ్వదాభిరామ వినురవేమ

.వేమన

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : బూర్గుల రామకృష్ణారావు

# నిమ్మ తొనలు

తను చిన్నప్పుడు చదువుకున్న స్కూలులోని వార్షికోత్సవ సందర్భాన, వేదిక మీద ముఖ్య అతిథిగా ఆశీనులైవున్న యమ్మెల్యే ముకుంద రావు ఈవిధంగా ప్రారంభించారు: "నన్ను మీరు ఆహ్వానించి, యింత ఘనంగా సత్కరిస్తున్నందుకు, కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు. పనుల ఒత్తిడిలో ఉన్నప్పటికీ, మీ మాట కాదనలేక వచ్చాను. రాజకీయాలంటే నిరంతర జాగరూకతతో మెలగవలసిన రంగం. ఇవ్వాళ ఈ ఉత్సవం ఎందుకు జరుపుతున్నారో నాకు తెలీదు...."

పిల్లలు దడదడా చప్పట్లు కొట్టే సరికి, తన ఉపన్యాసం విని మెచ్చుకుంటున్నారని అనుకున్నాడు యమ్మెల్యే ముకుందరావు.

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

మాధవరావూ, గోవిందూ బంధువులింట్లో పెళ్లికి వెళ్లారు. పెళ్లి పందిరి పూల తోరణాలతోను అగరు ధూపంతో ఘుమఘుమ లాడుతోంది. ఆ సువాసనలకు తోడు పట్టుచీరెలతో రాళ్ల నెక్లెస్‌లూ రవ్వల దుద్దులతో సుందరీమణులు. వధూవరులు పెళ్లి పీటల మీద కూర్చున్నారు.

"బక్కపలచగా, పెళ్లికూతురు వెనక నిలబడ్డ ఆ కోలముఖం అమ్మాయి బావుంది కదూ?" అన్నాడు గోవిందు, మాధవరావుతో.

"నన్నడిగితే.... అటు వైపు చూడు, ఆ రవ్వల దుద్దులమ్మాయి పొడగరి అయినా చెప్పుకోదగ్గ అందగత్తె అంటాను" - అని మాధవరావు.

ఇద్దరు బ్రహ్మచారులకి పోస్ట్ గ్రాడ్యుయేషన్ యింకో రెండు నెలల్లో పూర్తవుతుంది. ఆపైన ఉద్యోగమూ, వివాహమూ.

"చూడు, చూడు - ఆ పాలపిట్ట రంగు చీరె కట్టుకున్న అమ్మాయి. ఆమె కనికరిస్తే నా జీవితం ధన్యమైనట్లే...." - అని గోవిందు తన మిత్రునితో యింకా ఏమిటో చెప్పబోతూ వుండగా, వెనకనున్న పెద్దమనిషి గోవిందు చెవి బుచ్చుకు మెలిపెడుతూ, 'ఆమె నా భార్య' - అన్నాడు.

'క్షమించండి' అంటూ మిత్రులిద్దరూ జారుకున్నారు.

—బులుసు శారద
కలకతా-53

వెంగ్గురు మూర్ఖులు పార్కులో కూచుని చర్చిస్తున్నారు.

'సూర్యుడూ చంద్రుడూ ఒకే తల్లి బిడ్డలు కదా - ఒకరు కోపంగాను వేడిగాను, మరొకరు చిరునవ్వుతోను చల్లగాను ఉండటానికి కారణం ఏమిటి ?' - అని మొదటి మూర్ఖుని ప్రశ్న.

'ఆ మాత్రం తెలియదూ ? సూర్యుడూ చంద్రుడూ అన్నదమ్ముల బిడ్డలు. అందుకే అలా వున్నారు' - అని రెండవ మూర్ఖుని సంజాయిషీ.

'మీ రిద్దరూ పరమ మూర్ఖులు. సూర్యుడూ, చంద్రుడు కేవలం గాలి బూరాలు. ఒక దానిలో అగ్నిపర్వతాలు వుండటం వల్ల వేడిగాలి, మరో దానిలో మంచు కొండలు వుండటం వల్ల చల్లని గాలి' - అని వివరించాడు మూడో అతను.

—పసల బాలసుందరరావు
ఫిరంగిపురం

ప్రజానాయకుడు భూపతిరావు తన భార్యామణితో తీర్థ యాత్రకు వెళ్లాడు.

పుష్కరిణిలో స్నానం, స్వామి వారికి అర్చన, అభిషేకం యిత్యాదులన్నీ అయాక, కాటేజీకి వస్తున్నప్పుడు భార్యని అడిగాడు : 'ఏమోయ్, ఏమని మొక్కుకున్నావ్ ?'

'మీకు పార్టీ టికెట్ యిప్పించమని మాత్రం కోరలేదు' - అన్నదామె.

'ముగ్గురు ఆడపిల్లలూ ముగ్గురు మగపిల్లలూ వుండగా, యింకా పిల్లలు కావాలని కోరావా ?'

'ఇద్దరు చాలని ఏనాడో మీకు చెప్పాను. మీరు వట్టిభయస్తులు - విన్నారు కాదు.'

'సర్లేవోయ్, యిప్పుడదంతా ఎందుకు ? ఇంతకీ ఏం కావాలని కోరావ్ ?'

'చెప్పమంటారా ?' అని భర్త ముఖంలోకి చూస్తూ అడిగిందామె.

'ఊఁ'

'మా వారిని ఎవరి చేతనైనా కిడ్నాప్ చేయించు, స్వామీ. ఆ విధంగా పేరు ప్రఖ్యాతులు వస్తాయి'

—రెడ్డి శివనాగేశ్వరరావు
మాచర్ల

# పాఠకుల తీర్పు

మాన్యులు శ్రీ చందూర్‌గారికి: 'జగతి' లో 'చందూర్ రచనలు' ప్రకటనలోని హుందాతనం నాకు ఆనందాన్ని కలిగించింది. మిత్రులు రవీంద్రనాథ్‌గారికి, మీరు పత్రిక నడిపే తీరు నచ్చింది. మద్రాసు యీ మధ్య బొత్తిగా రాలేదు. చాలామందిని చూడాలి - బియస్‌ఆర్, రమణయ్య రాజా, ఆంజనేయులు, మాధవరావు (కాన్సలేట్) మొదలైనవారు.

—యన్ ఇన్నయ్య
హైదరాబాదు-34

శ్రీ చందూర్‌గార్కి: జూన్ నెల 'జగతి' లో, నారాయణ రెడ్డిగారు, మారిషస్ ప్రపంచ తెలుగు మహా సభలలో చేసిన ఉపన్యాసం, నాకెంతో నచ్చింది. కేసరిగారి 'ముచ్చట్లు' చాలా ఇంటరెస్టింగ్. శివస్వామిగారు అమెరికాలో ఉన్నప్పటి టెలిఫోన్ సమాచారం, గంటన్నరలో టెలిఫోన్ బిగించి వెళ్లిపోవడం.... అటువంటివి అక్కడే సాధ్యం.

—విజయలక్ష్మి
మద్రాసు-5

శ్రీయుతులు చందూర్‌గారికి: నమస్కారములు.... 1953-60 ప్రాంతాల ఆమెని చూడాలనీ, మాట్లాడాలనీ ఎంత ఎదురు చూచేవాళ్లమో! ఇన్నాళ్లకు, యిన్నేళ్లకు ఆ కోరిక నెరవేరడం చిత్రంగా అనిపిస్తుంది.... నెమ్మదిగా నిశ్చలంగా నిర్మలంగా కనిపించే ఈమె, ఒక ఉద్యమంలా స్ఫూర్తినిచ్చేది. తెలుగు స్త్రీలలో రచన, విమర్శన, పరిశీలన వంటి 'స్కిల్స్' 'డెవలప్' అగుటకు మాలతీ చందూర్ ఊపిరిపోశారు - ఆమె పాత్ర వర్ణించలేనిది.... యూనివర్సిటీలలో ఫంక్షనులు, సెమినార్లు, వర్క్‌షాపులూ జరుగుతూంటాయి. కాని, మీ యిరువురి విజిట్‌లో ఎంతో ప్రత్యేకత, ఎన్నో భావాలతో అనేక సంవత్సరాలుగా ముడిపడి ఉంది. జీవితంలో మరపురాని ఒక మధుర ఘట్టం.... ఏలూరు సెయింట్ థెరిసా కాన్వెంట్ ఈ ఆత్మీయతకు, అభిమానానికి కొంత కారణమేమో చెప్పలేను.... 'జగతి' లో మీరు వ్రాసినది చదివినప్పట్నుంచీ, ఇంకా జవాబు వ్రాయలేదే అను దిగులు యివ్వాళ తీరింది.... ప్రిన్సిపాల్‌గా శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం తరఫున, మీ యిరువురికి హృదయపూర్వక శుభాకాంక్షలు.

—ఎ సత్యవతి
తిరుపతి-2

# వెన్నెల కెరటాలు

## నవ్య మానవత

యుద్ధానంతరం సోవియట్ రష్యాకూ, ఇంగ్లండుకూ మధ్య విభేదాలు పొడసూపే సూచనలు కన్పించాయి. ఫాసిజానికి వ్యతిరేకంగా వీరోచితంగా పోరాడిన రష్యా మళ్ళీ సిద్ధాంతాల జంజాటంలో పడిపోయి, యుద్ధ కాలంలో సంపాదించుకున్న ప్రతిష్ఠను కోల్పోవడం ఈయనకు (యమ్ యన్ రాయ్) నచ్చలేదు. కమ్యూనిజం నుంచి అవతలకు వెళ్ళవలసిన అగత్యాన్ని ఆయన గ్రహించ నారంభించాడు. రాడికల్ డెమోక్రాట్ అయిన ఈయన రాడికల్ హ్యూమనిస్టుగా మారాడు. భవిష్యత్తులో ప్రపంచానికి నవ్య మానవతా వాదమనే ఒక సిద్ధాంతాన్ని సమర్పించాడు. ఈ కొత్త సిద్ధాంతానికి రాడికల్ డెమోక్రటిక్ పార్టీ తగింది కాదని భావించి దానిని రద్దు చేశాడు. అసలు పార్టీ రాజకీయాలనే త్యజించాడు. సాంఘిక విప్లవం రావాలంటే మొదట తాత్త్విక భావవిప్లవం రావడం అవసరమన్నాడు.

—డి రామలింగం
'యోజన' లో

## కవితా రూపం

తిలక్ (దేవర కొండ బాలగంగాధర్ తిలక్) ప్రణయ కవిత్వాన్ని 'అమృతం కురిసిన రాత్రి' 'ప్రభాతము - సంధ్య' కావ్యాలలో వర్ణించేరు. ప్రణయ భావాలలో వియోగం, సంయోగం, ఆధ్యాత్మికం అనే దశలు గోచరిస్తాయి. 'అమృతం కురిసిన రాత్రి' సంపుటిలో స్వేఛ్ఛా విహారం ఖండికలో, సమస్యల్ని విడిచి, ఊహా ప్రేయసితో 'కొంచెం సేపు స్వప్నంలోకి గోర్వంకల రెక్కలతో ఎగిరి' పలాయనానికి సిద్ధపడ్డారు 'ఒక్కసారి' అను ఖండికలో 'తొలిరేవున లంగరెత్తి తెలివెల్గుల ఓడ కదలు' అని ప్రేయసితో ప్రణయ నౌకా విహారం ఆశించేరు. 'గుండె కింద నవ్వు' అను ఖండికలో 'అంధకారపు సముద్రానికి అవతల వొడ్డున నీ రూపం కనిపించింది' అని ఆశ పెంచుకున్నారు.

—డి లలిత కుమార్
'స్రవంతి'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

కన్మణి ఫిలింస్ వారి

## 'ఛమ్మీన్'

భారత రాజ్యాంగమూ, కేంద్ర సాహిత్య అకాడమీ గుర్తించిన భాషలు, యించుమించు పాతిక వున్నప్పటికీ, బెంగాలీ, మళయాళాలలో మాత్రమే సంఘ స్వరూపం చూబుతూ, సామాజిక వాస్తవికతకు సన్నిహితంగా వుండే చిత్రాలు వెలువడుతున్నాయి. మన భాషాభిమానం, ప్రాంతీయాభిమానం ఎంత గొప్పదైనప్పటికీ ఈ ప్రత్యక్ష సత్యం విస్మరించలేము. 1956లో టి శివశంకర పిళ్లై మళయాళంలో రచించిన 'ఛమ్మీన్' (ఎర్రచేప), కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్ పొందిన ప్రఖ్యాత నవల. పధ్నాలుగు భారతీయ భాషలేగాక ప్రపంచ వ్యాప్తంగా, ఇంగ్లీషు, రష్యన్, జర్మన్, ఇటాలియన్, ఫ్రెంచి, స్పానిష్, జెక్, పోలిష్ భాషలలోకి అనువాదం పొందింది. ఈ నవల రేడియో అనుసరణ విన్న శ్రోతలు 'కరుత్తమ్మా కరుత్తమ్మా' అంటూ పారికుట్టి చేసిన ఆక్రందన సముద్ర ఘోషలో కలవడం మరిచిపోయి వుండరు (పాతికేళ్లక్రితం టివి లేదు).... బెస్తవారికి సముద్రం ఒక పెన్నిధి. ఆ పెన్నిధిని ప్రసన్నురాలిగా చేసుకు జీవయాత్ర సాగించే బెస్తపల్లెలో, స్వంతపడవ సంపాదించుకోగలిగిన చెంబన్ కుంజు కూతురు పేరు కరుత్తమ్మ. ఈ కరుత్తమ్మా పారికుట్టిల మధ్య సహజాకర్షణ ఏర్పడుతుంది; వయసుతో వికసించే వలపుకి బందీలవుతారు. అయితే పారికుట్టి అన్యమతస్థుడు. సముద్ర దేవత కరుణా కటాక్షంపై జీవించే తాము, తరతరాలుగా వస్తున్న ఆచారాలు పదిలంగా కాపాడుకోవాలి; కట్టడి ఌ ఆ దేవత ఆగ్రహిస్తుంది - అని తల్లి హితవు చెప్పగా, తండ్రేమో తమకులం వారికిచ్చి పెళ్లి చేస్తాడు. పళనితో వివాహమయాక, కరుత్తమ్మ మరొక బెస్తపల్లెకు వెళ్లిపోతుంది. విష నాలుకలకు బెదరకుండా, ఇద్దరూ హాయిగా వుంటారు; తొలివలపుని ఆమె మర్చిపోగలుగుతుంది. కాని ఒక పాప కలిగాక, భర్త పళని 'ఈ శిశువు నాకు కలిగినదేనా?' అని అడిగేసరికి కరుత్తమ్మకు తను భూమిలోకి కుంగిపోతున్నట్లనిపిస్తుంది. చంద్రకాంతిలో పారికుట్టి పిలుపు, సముద్ర మధ్యాన సొరచేపతో పోటీపడ్డ పళని అరుపూతో కరుత్తమ్మ కావ్యం ముగుస్తుంది. రాష్ట్రపతి బహుమతి పొందిన ఈ చిత్రానికి నిర్మాత ఇరవై రెండేళ్ల ఇస్మాయెల్.

—యన్నార్ చందూర్ సమీక్ష,
'జగతి' - అక్టోబరు 1966

## మానవ ప్రగతి

### ఉక్కు

భారతదేశానికి స్వతంత్రం వచ్చిన వెంటనే, ఆర్థిక వ్యవస్థను పటిష్ఠపరిస్తే తప్ప కొత్తగా లభించిన స్వాతంత్ర్యానికి అర్థంలేదని దేశనాయకులు గుర్తించారు. 1948 లో చేసిన పారిశ్రామిక విధాన తీర్మానం ద్వారా మౌలిక పరిశ్రమలన్నీ ప్రభుత్వ రంగంలోకి వచ్చాయి. ఈ పరిశ్రమలకు పెద్ద మొత్తంతో పెట్టుబడులు కావలసి వచ్చింది. ఉత్పత్తి ప్రారంభించటానికి ఎక్కువ సమయం పట్టడమే కాక పెట్టుబడులపై ఆశించిన ఫలితాలు లభించలేదు. ప్రైవేటు రంగం ఈ పరిశ్రమలలో పెట్టుబడి పెట్టడానికి సుముఖంగా లేదు. దాని వద్ద అంత సామర్థ్యమూ లేదు. ఉక్కు తయారు చేసే కర్మాగారాన్ని ప్రారంభించాలని అప్పటి ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ పట్టు బట్టారు. ఇందుకు నాందిగా ప్రారంభంలో మూడు ఉక్కు కర్మగారాలు వచ్చాయి. ఉక్కు పరిశ్రమ తక్షణమే చర్యలు తీసుకోవటం జరిగింది. ఆ తర్వాత మరిన్ని కర్మాగారాలు వచ్చాయి. ఉక్కు పరిశ్రమ బాలారిష్టాలను అధిగమించి ప్రస్తుతం ఉచ్ఛదశకు చేరుకుంది. 1989-90 సంవత్సరంలో దేశంలో మొత్తం కోటీ నలభై లక్షల టన్నుల ఉక్కు అవసరం కాగా, కోటీ 36 లక్షల టన్నుల ఉత్పత్తి జరిగింది. ఈ మొత్తంలో ప్రభుత్వ రంగ సంస్థల వాటా 66 లక్షల టన్నులు. 1994 - 95 నాటికి 2 కోట్ల 20 లక్షల టన్నుల ఉక్కు అవసరమవుతుంది. అయితే 9 లక్షల టన్నుల మిగులుతో 2 కోట్ల 29 లక్షల ఉక్కు ఉత్పత్తి జరుగుతుందని భావిస్తున్నారు. భారత దేశంలో ఉక్కు తయారీకి 16 వందల సంవత్సరాల చరిత్ర ఉంది. కుతుబ్‌మినార్ వద్ద గల ఇనుప స్తంభం ఇందుకు నిదర్శనంగా నిలుస్తుంది. ఈ స్తంభాన్ని, కాల్చిన ఇనుముతో నిర్మించారు. 99.97 శాతం శుద్ధ ఇనుముతో నిర్మించబడిందని దానిపై వ్రాయబడిన రెండవ చంద్రగుప్తుని శాసనం తెలుపుతుంది. 1947 లో దేశంలో కేవలం మూడు

ఉక్కు కర్మాగారాలు మాత్రమే ఉండేవి. వీటిలో 10 లక్షల టన్ను లకు పైగా మాత్రమే ఉత్పత్తి జరుగుతూ ఉండేది. 1953 లో ఒరిస్సాలోని రూర్కెలాలో (పశ్చిమ జర్మనీ ఒప్పందంతో); 1956 లో భిలాయ్, దుర్గాపూర్‌లలో ఒక్కొక్కటీ పది లక్షల టన్నుల ఉత్పత్తి సామర్ధ్యం గల రెండు కర్మాగారాలను నెల కొల్పేందుకు రష్యాతోను, ఒక బ్రిటీష్ సంస్థతోను ఒప్పందాలు కుదిరాయి. ఈ మూడు కర్మాగారాలు 1956లో పని చెయ్యటం ప్రారంభించాయి. (బలదేవ్ సహాయ్ - పి ఐ బి.

## స్మోకింగ్

'నేను పొగత్రాగడం లేదు కనుక నా ఆరోగ్యానికేం ఢోకా లేదు' అని ధూమపానం దురలవాటు లేని వారెవ రైనా చెప్పారంటే వారు పొరబడినట్టే లెక్క! మీరు పొగత్రాగని వారైనప్పటికీ మీ పొరుగువారు ధూమపాన ప్రియులైనట్టయితే, మీరు ప్రమాదంలో చిక్కుకున్నట్టేనని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. అమెరికాలో ఏటా 5 లక్షల మందికి పైగా పొగత్రాగని వారు, ఇతరులు పీల్చి వదులుతున్న పొగవల్ల, అనారోగ్యానికి గురై బాధపడుతున్నారని ఇటీవల వెల్లడైంది. ప్రత్యేకించి ఆఫీసుల లో పనిచేసే 'నాన్ స్మోకర్లు' తమ చుట్టూ గల 'స్మోకర్లు' వెలువరించే పొగవల్ల ప్రమాదానికి గురవుతున్నారని కూడా తేలింది. అమెరికన్ హార్ట్ అసోసియేషన్ ఆధ్వర్యంలో వెలువడే 'సర్క్యులేషన్' అనే పత్రికలో ఈ పరిశోధనా వివరాలు తెలియజేశారు. నివారించడానికి అవకాశం వుండి కూడా మరణాలకు కారణమవుతున్న మూడు ప్రధాన సమస్యలలో 'పాసివ్ స్మోకింగ్' (ప్రక్కవారు వదిలిన పొగను పీల్చడం) ఒకటిగా స్థానం పొందింది. మిగతా రెండు కారణాలలో ఒకటి 'యాక్టివ్ స్మోకింగ్' (స్వయంగా ధూమపానం చేయడం) కాగా మరొకటి ఆల్కహాల్ సేవించడం! ఏటా 37,000 మందికి పైగా అమెరికన్లు 'పాసివ్ స్మోకింగ్' వల్ల ఏర్పడే గుండె జబ్బులతో చనిపోతున్నారు.... (అమెరికా సమాచారశాఖ

## నర వానరం

దక్షిణాఫ్రికాలోని ట్రాన్స్‌వాల్ రాష్ట్రంలో టాంగ్ పట్టణం వద్ద 1924 లో సున్నం రాతి గనులు తవ్వుతుండగా, కొన్ని ప్రాచీన జంతువుల అవశేషాలు బయల్పడ్డాయి. వాటిలో ఐదేళ్ళ వయస్సున్న పిల్ల వానరం పుర్రె, ప్రొఫెసర్ డార్ట్ దృష్టిని ఆకర్షించింది. ఆ పిల్ల వానరానికి "ఆస్ట్రలోపితికస్" అని ఆయన పేరు పెట్టాడు. ఆదిమ నరునికి నేటి వానరానికీ మధ్యనున్న మృగంగా ఆయన దీన్ని పరిగణించాడు. దీనికి అధికంగా మానవ లక్షణాలున్నాయనీ, అంచేత అత్యంత ప్రాచీనమైన

జంతువై వుండాలనీ, అది రెండు కాళ్ళతో నడిచేదనీ, 1925 లో డార్ట్ ప్రకటించాడు. అయితే ఆయన నిర్ణయంతో ఎక్కువ మంది శాస్త్రవేత్తలు ఏకీభవించలేదు. ఇది - పిల్లవానరం అవశేషమైనందువల్ల, దాని స్వరూప స్వభావాల్ని సమగ్రంగా నిర్ణయించడానికి వీలు చిక్కలేదు. 'ఆస్ట్రలో పితికస్' కుటుంబానికి చెందిన రకరకాల పుర్రెలూ ఎముకల్ని, రాబర్ట్ బ్రూం అనే శాస్త్రవేత్త కనుగొన్నాడు. నిశితంగా వాటిని పరిశీలించిన తర్వాత, ఆ నరవానరాలన్నీ రెండు కాళ్ళతో నడవగలిగేవని నిర్ణయించడం జరిగింది. 20 లక్షల ఏళ్ళ క్రితం 'ఆస్ట్రలోపితికస్' జీవించిందని శాస్త్రజ్ఞులు నిర్ధారించారు... (అమ్మాజీ సర్కార్, గల్ఫ్.



చిన్నతనంలో నేను వైద్యుని వద్దకు, వేదాంతి వద్దకు తరుచూ వెళ్తూండేవాడిని. వారి వాదోపవాదాలు ఎంతో శ్రద్ధగా ఆలకించేవాణ్ణి. ఎన్నో సంగతులు మాట్లాడేవారు. అయితే, నేను మాత్రం వెళ్ళిన ద్వారం నుంచే వెనక్కి వచ్చేవాణ్ణి.

—ఉమర్ ఖయ్యామ్











1991 ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక బాగుందని ప్రశంసిస్తూ అభినందన లేఖలు వ్రాసిన పాఠక మిత్రులందరకు మా కృతజ్ఞతాంజలి.

తమకొక కాపీ కావాలంటూ కార్డులూ కవరులూ వ్రాసిన వారికి, కాపీలు లేవనీ లభ్యం కావనీ వినయపూర్వకం తెలియజేస్తున్నాము.

పరిమిత సంఖ్యలో ప్రింటయ్యే పత్రిక ఈ 'జగతి' - విడుదలై, పోస్టుకెళ్లాక మా దగ్గిర ఆఫీసు కాపీలు తప్ప ఇంకేమీ మిగలవు. న్యూస్ స్టాండ్స్ ద్వారా అమ్మకం ఏర్పాటు లేదు - అది మాకు ఒకవిధంగా గిట్టుబాటు కూడా కాదు. అందుకనే, ప్రతి నెలా చదవాలనుకొనేవారిని చందాదారులు గమ్మని మనవి చేస్తూంటాము. చందాదారుని ఇంటి గుమ్మంలోకి పోస్టులో వస్తుంది పత్రిక. దేశ విదేశాలలోని పాఠకులకు ఆ విధంగానే అందిస్తున్నాము.

ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక కోసం వ్రాసిన వారికి మా విన్నపం : లోగడ స్త్రీల సంచిక, పిల్లల సంచిక పునర్ముద్రించినట్లే, ఈ విశేష సంచికలోని ముఖ్యాంశాలను, ఇంకో రెండు మూడు నెలలలో మామూలు సంచికలో పునర్ముద్రిస్తాము. అరవై చిత్రాల సంక్షిప్త సమీక్షలు, ప్రపంచ సినిమా, భారతీయ సినిమా, స్మృత్యంజలి, మిగతావి అను శీర్షికలు పద్దెనిమిది బొమ్మలతో పునర్ముద్రణ పొందుతాయి.

చందా వివరాలు : 24 సంచికలకు రు 50-00 ; జీవిత చందా : రు 300-00 ; పాట్రన్ : రు 1000-00.



JAGATI Monthly, 2, Kutchery Road, P.B. 2922, Madras-600 004



# ఇది మన జన్మ భూమి

సరోజినీ ప్రేమ్ చంద్

అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి
వినబడలేదా ఋగ్వేదపు వాక్కులు
ఋషికల, ఋషుల ఋక్కులు
సత్యే నోత్త భితా భూమిః
సప్తసింధులో వుద్భవించినవి
పంచనదులు పరిషేవించగ
త్యే నోత్త భితా భూమిః
అచంచలమ్మీ భరతభూమి
అనవరతం యిది నిజం నిజం ॥

కుంకుమ పూవుల మాలికలు
వెదురు పొదల వికసించే వెన్నెల
రమణుల మనోహరణం
బాంధని కళల అందం
రవికవి గీత గానాలు
రాణాల శౌర్య గాథలు
శిలలో మ్రోగే సప్త స్వరాలు
శతాబ్దాలుగ మాయని చిత్ర పటాలు
విజృంభిత తరంగ లాస్యంతో
పులకాంకురములగు పాదాలు
ఇది మన జన్మభూమి
అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి ॥

అహింస, దుష్టశిక్షణ
ఏకో బ్రహ్మ
ముక్కోటులు దేవతలు
కాసెపోసిన కావి చీరె
కంప్యూటరుపై కమల, విమల
చార్వాకం, ఛాందసం
అనేకులకిది ఒకే గృహం
అందరకూ ఒకే ఛత్రం
సకల జనులకు స్వంతం
విపుల హృదయ
వినీల గగన
ఇది మన జన్మభూమి
అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి ॥

బోధి ఛాయన వెలసిన కాంతులు
శ్వేతాంబరుల పావన చరితలు
చతుర్దిశలు మ్రోగే
గంభీర స్వనముల
ఆచార్యుల వివేక ప్రసాదం
నానకు, కబీరు
త్యాగయ, మీరా
తన్మయ ప్రభావితం
అంతా ఒకే మతం
సన్మతమే యీ భూమికి అలంకృతం
సమ్మతమే మనకందరకు
సకల మత సారం
ఇది మన జన్మభూమి
అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి ॥

హిమ శిఖరాల ధావళ్యం
ఉదయాద్రిని చిగిర్చిన అరుణం
నీలంపు తరంగిణులు విమలం
పచ్చగ తలలూపే వరిమళ్ళ పుష్కలం
సేవకు అంకితం
ఈ స్వాముల కాషాయం
వివిధ వర్ణ సముదాయం
ఇంద్రచాపం యీ జాతి చందం
ఇది మన జన్మభూమి
అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి ॥

యవనుల, కుషానుల
మొగలుల, పడమటి దొరల
కడుపు నింపి పంపిన
అన్నపూర్ణ యీ వసుంధర
అమృత జలాల ధారలు వంపి
జ్ఞానతప్తుల తరింపించిన
సారస్వత సరస్వతి
వివిధ భాషా భారతి
ఇది మన జన్మభూమి
అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి ॥

అలనాటి తత్త్వాలు
అభ్యుదయ పంథాలు
గాంధీ వాదం
యంత్ర ప్రపంచం
ఈ సకల స్వర సమ్మేళనం
వెలువరించునొక
సమశ్రుతి యుక్త విపంచిక
అది అఖిల జన సమజీవన
రాగ మాలిక
మధురం మధురం
ఈ నవ ధర్మం

మనకు ప్రియం భారత వసుంధరం
అనన్యం మన జాతి చరితం
శతకోటి వందనలమ్మా జన్మ భూమి
అఖండమీ భరత భూమి
అవిచ్ఛిన్నమీ జాతి సంస్కృతి ॥

✠ ✠ ✠

ఋషిక — వేదాలను రచించిన వారిలో స్త్రీలూ పురుషులూ కూడ వున్నారు. పురుషులను ఋషులు అన్నట్లుగా స్త్రీలకు ఋషికలు అంటారని శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ వ్రాశారు. సూర్య అనే పేరుగల ఋషిక చెప్పిన ఋక్కులోనిదే 'సత్యేనోత్త భితా భూమిః' అనే వ్యాక్యం, ఋగ్వేద కాలంలో ఆర్యులు సప్తసింధు అంటే అవి భక్త పంజాబు ప్రాంతంలో సంచరిస్తుండేవారు. అప్పుడే యీ వేదంలోని ఋక్కులు చాలా వరకు ప్రవచింపబడినాయి.

వెదురు పొదలు - అస్సాముకు సంకేతంగా, బాంధని - గుజరాతుకు - ఇట్లాగే మిగత ప్రాంతాను పోల్చుకోవచ్చు. 'తూర్పున చిగిర్చిన అరుణం' బెంగాలులో కమ్యునిస్టు ప్రభావాన్ని సూచిస్తుంది,

✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠

రక్షకుడు వచ్చాడు. వాణికే పెదవులతో యూరఫ్‌లోని యుద్ధ నౌకలు లెక్కించి, 'లక్షలాది ప్రజలకు తిన తిండి లేదే - యుద్ధ మనగా యింత వెర్రా ?' అన్నాడు.

—నార్మన్ గేల్

తను ఏనాడూ తప్పు చేయలేదు - అనుకోవడాన్ని మించిన ఘోర తప్పిదం మరొకటి లేదు.

—కార్లయిల్

✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నం చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు



గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు ; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కాస్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయడు గారొకరు.... ఇరవైఏడేళ్ల క్రితం అమ్మమ్మ గారు (బెన్నూరి కృష్ణవేణమ్మ - దుర్గాబాయి గారి తల్లి) ప్రకాశరాయడి గారి వ్యక్తిత్వమూ, త్యాగశీలత గురించి చెబుతూండే వారు. పదిహేనేళ్ల క్రితం ఆ మహనీయుని హైదరాబాదు ఆంధ్ర మహిళా సభ గాంధీ మందిర్‌లో కలుసుకోగల అవకాశం లభించింది - ఆ అవకాశాన్ని కల్పించినవారు ప్రియ మిత్రులు బివిడి నారాయణరావు గారు - అంటే దుర్గాబాయి గారి తమ్ముడు. ప్రకాశరాయడుగారు ఆ రోజున మాకు 'నివేదన' పుస్తకం యిచ్చారు ఎంతో ప్రేమగా.... ఆరేళ్ల క్రితం గాంధీ క్షేత్రం నుంచి 'నా రాట్నం చక్రం' సమీక్షార్థం రాగానే, ఒక్క బిగిని చదివి, ముగించాను. రఘుపతి వెంకటరత్నం నాయుడు, మహాత్మాగాంధీ వల్ల ప్రభావితుడైన సద్విద్యాధికుని

జీవిత మజిలీలు కళ్లకి కట్టినట్లు కనిపించాయి.... కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' చదివి మెచ్చుకున్న పాఠకులు, అటు వంటిదే మరొకటి వేయమని కోరగా, ప్రకాశరాయడి గారి జీవితం సంక్షిప్త పరిచయం చేదామని అనిపించి, బుద్ధప్రసాద్ గారికి, రాజారామ్ గారికి అనుమతికోసం వ్రాశాను. ఇరువురూ వెంటనే అంగీకరించినందుకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు.



## పూళ్ళ మిడిల్ స్కూలు

ఉంగుటూరు ప్రాథమిక పాఠశాల, తదుపరి దివాకర్ల పల్లయ్య శాస్త్రులు ప్రైవేటు ఇంగ్లీషు చదువు అయిన తరువాత, నా చదువు నికరంగా ఒక దారిని పడది. ఉంగుటూరుకు ఏడు మైళ్ళ దూరంలోనున్న పూళ్ళ గ్రామం లోని బోర్డు లోయర్ సెకండరీ స్కూలుకు నన్ను పంపించాడు మేనమామ. మా కుటుంబానికి (యిద్దరు చెల్లెళ్ళు, మా అమ్మతో సహా) ఒక బంధువుల యింట కాపురం ఏర్పాటు చేశాడు. ప్రతి దినం మా నలుగురికి సరిపడే పెరుగు రావులపర్రు నుండి వచ్చేది. బయారపు సీతారామస్వామి (పదవ కళాసు) రావులపర్రు నుండి తెచ్చి మాకు అప్పజెప్పేవాడు. లక్ష్మీనరసింహంగారి బావమరిది మధునాపంతుల రామస్వామిగారు. పేరుకు తగిన హుందాగల మనిషి. ప్రతిమాట స్పష్టంగ వినవచ్చే కంచుకంఠం. పసుపుపచ్చని శరీరచ్ఛాయ. ఏక్లాసు ఎటా జరుగుతోందో చూడడానికి తరచు అజమాయిషీ చేసేవాడు. నాది మల్లాది విశ్వనాథంగారి మూడో తరగతి. ఆ కాలంలో క్లాసుమాస్టరే అన్ని పాఠాలు చెప్పేవారు. విశ్వనాథంగారి పాఠాలు గూడా క్లాసు పిల్లల గుండెకు బాగా పట్టేవి. ఆ తరువాత అన్ని స్కూళ్ళలో నా కటువంటి ఉపాధ్యాయులే తటస్థపడారు. ఒక కాలనిర్ణయపట్టిక (టైం టేబుల్), పాఠ్యక్రమం ఏర్పాటయింది. ఉపాధ్యాయునిలో అన్ని పాఠాలు (Subjects) సమర్థతతో చెప్పగల శక్తి, విద్యార్థుల్లో గురువు పట్ల ఒక గురి, గౌరవభావం ఉండేవి. ఏరోజూ యింటివద్ద చేసుకురావలసిన వ్రాత పని, లెక్కలు యిచ్చేవారు. ఆ చేసిన పని క్లాసులోనూ మాస్టరు తన ఇంటి వద్దను సరిదిద్దేవారు. ఆయన మూర్తి నా కిప్పటికీ కండ్లయెదుట ఉంది. గురువు నడవడిని బట్టియే, శిష్యునిలో క్రమశిక్షణ దానంతట అదే ఏర్పడుతుందన్న మాట సత్యం. చిన్నతనంలో నా పూళ్ల అనుభవాలలో ఇదొకటని చెప్పగలను. అక్కడి 1903 చదువులో ముఖ్యంగా ముగ్గురు క్లాసు పిల్లలు

నాకు జ్ఞాపకమున్నారు. చెదలవాడ చంద్రం దొడ్లో గులాబిపువ్వులు మస్తుగా పూచే వనుకుంటాను. తరుచు ఒక పెద్దగులాబి పువ్వు తెచ్చి నాకు మాత్రమే యిస్తుండటం అతనికి అలవాటు. గులాబి పువ్వును చూడటం నాకు అదే మొదలు. పచ్చిపులుసు వీరయ్య నాకు బాగా జ్ఞాపకమున్న రెండో విద్యార్థి. కోమటి కనుక, ఇంట్లో ఒక మిఠాయి దుకాణముండేది. అప్పుడపుడు నా మీద యిష్టంకొద్దీ ఒక కొబ్బరిలౌజు బిళ్ళతెచ్చి నాకిచ్చేవాడు. ఎగురుకుంటూ పిచ్చిపాటలు పాడుతూ క్లాసు పిల్లల్ని నవ్వించేవాడు. ఇక మూడో విద్యార్థిని గుండు వారి మంగమ్మా? కాదు, బుచ్చెమ్మ. బహుబుద్ధిమంతురాలు. క్లాసుపిల్లలతో ఆమె మాట్లాడటం నేను చూచియుండలేదు. నెమ్మదిగా ఒక చివర కూర్చుని, సందడి చేయకుండ పుస్తకాలు పుచ్చుకొని, యింటికి వెళ్ళేది. ఆమె యిల్లు కూడ స్కూలికి చాలా దగ్గర. మంచి ఆడపిల్లల లక్షణమది యనుకునేవాణ్ణి.

చిటుక్కుమని లేచి, చిటుక్కున తన యింట ప్రవేశించేది. చదువులో కూడా ఎవ్వరికిని తీసిపోయేదికాదు.... పూళ్ళ యునికిలో మరొక విషయం - ముఖ్యమో, అముఖ్యమో - నాకు బాగా జ్ఞాపకముంది. పూళ్ళ కొకటి రెండు మైళ్ళలో పల్లపూరు (మల్కి మహమ్మద్‌పురం) అనే కుగ్రామం. అందొక దేవతా విగ్రహముండేది. ఇప్పటికీ ఉండియుంటుంది. అందులో "నత్తుభవానమ్మ" పేరుగల, చాలా పెద్ద ఎఱ్ఱని లక్కరంగు విగ్రహముండేది. పది చేతులతో తెల్లని,

పెద్ద కండ్లు గల విగ్రహమది. ప్రతి చేతిలోను ఒక ఖడ్గం, కాలికింద గట్టిగా తొక్కి పెట్టబడ్డ రాక్షసివంటి బొమ్మొకటి. ఆ విశాల రూక్షనేత్ర ద్వయం, భయం పుట్టే తెరచియున్న పెద్ద నాలుక చూచి, మాతో వచ్చిన కుర్రాడొకడు భయపడి 'అమ్మయ్యో', అని కెవ్వన కేకపెట్టాడు.... అట్లా ఒక యేడాదిపాటు పూళ్ళకాపురం, మూడవ తరగతి చదువు ముగిశాయి.

## ఉంగుటూరు L. S. స్కూలు

పూళ్ళనుండి ఆకస్మిక ఉద్వాసనకు ఒక కారణముంది. మా ఉంగుటూరులోనే మా కోసమని చెప్పి ఒక ప్రైవేటు మిడిల్ స్కూలు స్థాపించారు కొందరు పెద్దలు. 1) మా జ్ఞాతి కుటుంబాలలోని ఒక ప్రయోజకుడు, గ్రామంలో పలుకుబడి కలవాడు, తల్లా ప్రగడ సర్వారాయుడు; 2) ప్రక్క గ్రామ భూస్వామి వంకెన రామారాయుడు; 3) రావులపర్రు గ్రామ కరణం మా మేనమామ, ఆదూరి శేషయ్య. ముగ్గురూ పాతిక ముప్పై వయసువాళ్ళు, మంచి ఉత్సాహవంతులు. వాళ్ళ ఆర్థిక సమర్థతగాక, కేవలం ఉత్సాహమే వారిచేత స్కూలు స్థాపన చేయించింది. ఒకటి, రెండు, మూడు ఫారాలు వరుసగా అక్కడ మూడేళ్ళూ నడిచాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి వీరవానరం స్కూలు ఎత్తివేయగా దాని కుర్చీలు, బెంచీలు, డ్రాయర్లు, బ్లాక్‌బోర్డులు, ఖండాల, దేశాల గోడపటాలు, ఒక మంచి ప్రపంచ గ్లోబు, మా ఎడ్వర్డు లోయర్ సెకండరీ స్కూలుకు తెచ్చారు. స్కూలు ఒక యేడాది దోనేపూడి శేషయ్యగారి పాతయింట్లో వుండేది. రెండు, మూడు సంవత్సరాలు వేరే యిండలోనికి మార్చారు. షష్టుఫారం (1904) క్లాసుకు ఒకే మాస్టారుగా సూరంపూడి సీతారామయ్యగారిని తీసుకొని వచ్చారు. ఆయన పూర్వపు F. A. కాబోలు చదువుకున్నారు నెలకు రు. 30/- లు జీత మిచ్చేవారు. కుటుంబ పరివారంతో ఆయన మా యింటనే కాపురం. నేను పూళ్ళలో చదివింది మూడవతరగతి యైనా, నాల్గవ తరగతి చదవకుండానే నన్నిక్కడ ఐదవ తరగతి (first form) లో వేశారు. ఆనాటితో నా గణితం Subject సున్న చుట్టడం ప్రారంభమయింది. గ్రామ ప్రాథమిక పాఠశాలలో రెండో మాస్టరుగా నుండిన చివుకుల రామనాథశాస్త్రిగారు వచ్చి మాకు తెలుగు పాఠం చెప్పేవారు. వీరేశలింగంగారు వ్రాసిన తెలుగురీడర్లే వరుసగా మాకు మూడు ఫారాలలోను టెక్స్టు పుస్తకాలు. వడ్డాది సుబ్బరాయ కవిగారి చిన్న 'సుగుణ ప్రదర్శకం' first form లో మాకు పద్యాల పుస్తకం. చరిత్రకు తోడు 'దేవసహాయం' లెక్కల పుస్తకం కూడా ఇంగ్లీషులో వుండటంచేత లెక్కల సబ్జెక్టు మరీగడు అయి

పోయింది. Proper and Improper Fractions Mixed Numbers వాటి కూడిక తీసివేత numerator denominator లు మున్నగునవి నాకు పరమశత్రువులై యుండేవి. లెక్క తెలియకపోతే సీతారామయ్యగారు గట్టిగా కసురుకోడం, అప్పుడపుడు దెబ్బతగిలించడంతో, లెక్కల పాఠం భయావహమై పోయింది.

S.S.L.C. చివరివరకూ లెక్కల భయం వదలలేదు. అంకగణితానికి తోడు తణుకు IV Formలో బీజ గణితం [Algebra] ఒకటొచ్చి నా ప్రాణం తీసిందనే చెప్పాలి. ఆతరగతి లోనే పులిమీద పుట్రలాగున క్షేత్ర గణితం [Geometry] ఒకటందు కుంది. అందులో కేవలం అంకెలు అక్షరాలు గాక, గీతలు, సున్నలు, డ్రాయింగులు ఉండటంచేత మొదట్లో అదియేదో కొంత సరదాగా వుండేది.

మా First Form లోనే ఆ ప్రాంతపు Inspector of Schools J. A. Yates (తెల్లవాడు) ను మా స్కూలు పెద్దలు స్కూలుకు తీసుకొని వచ్చారు. అతడు చాల సౌమ్యుడు కనుక అట్లాగే వస్తానని చెప్పి సంతో షంతో వచ్చాడు. ఈ యుత్సవం చూడడానికి పొరుగూళ్ళవారు కూడ కొందరొచ్చారు. ఆ రోజున మాయిం ట్లోనే బిందెలతో కాఫీకాచి అందరికీ పోశారు. నేను కాఫీ చూడటం, దాన్ని రుచిచూడటం అదే మొదటి రోజు. మా మాస్టరు సీతారామయ్యగారు Shakespeare నాటకం Merchant of Venice లోని Trial Scene మా విద్యార్థులచేత కంఠస్థం చేయించి Yates యెదుట ప్రదర్శింపజేశారు. 'యేట్సు' దొరకూడ దానిని చూచి సంతసించి కొన్నిగంటలుండి వెళ్ళి పోయినాడు. అక్కడ చేరిన ప్రేక్షకు







అందరూ పెద్దగా చప్పట్లుకొట్టి Yates కు ఘనంగా వీడ్కోలు చెప్పారు.

వీరేశలింగంగారి III form తెలుగు వాచకంలోని "శకుంతల - దుష్యంతుడు" పాఠంలోని కొన్ని పద్యాలు నాకిప్పటివరకూ కంఠస్థమే. మాచేత map pointing చేయించేవారు సీతారామయ్యగారు, అదొక మంచి exercise గా వుండేది మాకు. చిన్నప్పటినుండి ఇండియా, ఆఫ్రికాల వంటి దేశాల outlines రైటుగా గీయటం అలవడింది నాకు. మంచి పుస్తకాలనిచెప్పి general reading రెండు మూడు పుస్తకాలు మాచేత కొనిపించారు. భాషాజ్ఞానం వృద్ధికావ డానికి Dictionary చూడటం నేర్పారు "Evenings at Home" లోనివి చిన్న చిన్న నీతికథలు. అందలి "Alexander and the Robber" ఎల్లకాలానికి పనికివచ్చే నీతికథ. మంచి సాహిత్యం మనిషికి అన్న పానాల కంటెను మిన్న. John Ruskin వ్రాసిన 'Sesame and Lilies' రెండోభాగం 'Queen's Gardens' లో నున్న విషయమంతా మంచి సాహిత్యంలోని మహత్వాన్ని గూర్చియే.... ఒకసారి Assistant Inspector of Schools మంతపూడి కామేశ్వరరావు గారు స్కూలు పరీక్షకు వచ్చారు 1906 లో. 'The Fox and the Grapes' అన్న కథ పది పన్నెండు చిన్న వాక్యాలలో మాకు వినిపించి అది మరల మాకు చేతనైన చిన్న వాక్యాలలో వ్రాసి చూపించమన్నారు. క్లాసు అంతా కలిసి పదిమంది ముంటిమేమో. మా పలకలన్నీ తీసుకొని, తప్పులు దిద్ది తిరిగి వాటిని మాకిచ్చివేశారు. నా పలక నా చేత బెడుతూ "Very good !" అని ఆయన నాకిచ్చిన నోటి Certificate, ఆ చిన్నతనంలో ఆ రిమార్కు, నాకెంతో గర్వకారణ మయింది. ఉంగుటూరుకు ఒక మైలు దూరంలో నున్న 'నాచుగుంట' గ్రామం నుంచి సుబ్బారాయుడు అతని తమ్ముడు కూడా నేమో చదువు కోసం మా స్కూలుకు వస్తూ ఒక పెద్ద మల్లెపూవుల పొట్లం తెచ్చి సీతా రామయ్యగారి యింట్లో యిచ్చేవారు.

1906 చివరలో మా మిడిల్ స్కూలు ఎత్తివేయబడ్డది. అది మా కోసమే వచ్చింది కనుక మా III form చదువుతోనే అది అఖరయ్యింది. ఈ మూడేండ్లూ అది బాగానే పనిచేసిం దని చెప్పుకోవాలి. సీతారామయ్య గారు స్కూళ్ళ సూపర్వైజరు పని సంపాదించి వెళ్ళిపోయినారు. II, III ఫారాల్లో ఆయనకు అసిస్టెంట్లుగా వచ్చి పనిచేసేవారు ఎవరి దారి వారు చూచుకున్నారు.

## 7
## పువ్వులు - పక్షులు

"విద్యయను దివ్యధనం బఖిలార్థి
కోటికిన్, బూర్తిగ నిచ్చినన్ బెరుగు
బోదు యుగాంతపు వేళనైన...."

ప్రపంచంలో పుట్టి బ్రతికేది ఒక్క మానవజాతి మాత్రమే కాదు. మానవ





# హృదయానికి దగ్గర దీనిని ధరించండి

ఈ పతాకము ఒక చిహ్నము అది మన స్వాతంత్ర్యానికి చిహ్నం మన స్వాతంత్ర్య పోరాటంలో లక్షలాది మంది ప్రజలు చేసిన త్యాగాలకు చిహ్నము

ఈనాడు ఆ త్రివర్ణ పతాకాన్ని అనుసరించి దేశపు భద్రత పురోగతులకు పోరాడిన ప్రజలందరు-అన్ని మతాలవారు అన్ని కులాలవారు అన్ని భాషలవారు అన్ని రాష్ట్రాలవారు ధనవంతులూ పేదలూ పురుషులూ స్త్రీలూ వృద్ధులూ యువకులూ వారందరినీ గుర్తు చేసుకుంటాము ఈ పతాకము మన హృదయాలకు అత్యంత ప్రియమైనది మరియు గౌరవించబడుతున్నది అది భారత దేశపు సమైక్యానికి చిహ్నము అంతేగాక అది మనందరి మధ్య ఉన్న పస్ని హితబంధము

## జాతీయ పతాకపు ఔన్నత్యాన్ని రక్షించండి

జీవితాన్ని సాధ్యం, సార్థకంచేసే సృష్టిజాలం బయట అపారంగా వుంది. జంతు, పక్షి, వృక్ష ప్రపంచాలతో మైత్రి కుదుర్చుకొని వాటికి సేవచేస్తూ వాటి సేవను పొందనిదే, మానవుని బ్రతుకే సాగదు.

Wordsworth కవితల్లో "Daffodils" అనే పద్యం ఒకటుంది. ఒక చెరువులోని నీటి అంచున, గట్టుకు చేరి, గాలిలో ఊగుతూన్న ఈ మొక్కలు, వాటి చివళ్ళను వికసించిన పసుపుపచ్చని పువ్వులను. ఆ సరస్సు గట్టు వెంబడే నడిచి వెడుతూ "Ten thousand saw I at a glance" అంటూ అలౌకిక పరమానందాన్ని పొందుతాడు కవి. ఒక్క చూపుతో యిట్టి ఆనందాన్ని పొందడం అతని విద్యానేత్రం తెరువబడటం వల్లనే!

మా తండ్రి స్వయంగా వేసినవో, అంతకు పూర్వము నుండీ ఉండినవో యేమోకాని అనేక రకాల వృక్షాలు గల 'నీలాద్రిపురం' తోటనుండి ఆయా ఋతువుల్లో పంటకు వచ్చే కాయలన్నీ యింటికి వచ్చేవి. అమ్మ, నాన్నలు నానోటి కందించిన సువాసన గల మామిడి రసమాధుర్యం మనసుకు వస్తోంది. యిన్ని associations సృష్టికర్త ఎట్లా పొందుపరచి యుంచుతాడో ఆశ్చర్యం. మామిడిపండ్ల నట్లావుంచి, చిరులిండికి చిన్న చిన్న అడవిపండ్ల చెట్లు కొల్లలుగా నుండేవి. మధ్య మధ్య రెండెడ్ల బండిని నిలిపి, నా కై పుణికి చేతి కందిచ్చే వాడాయన. ఆయన గతించిన పిదప నా పది పన్నెండేళ్ల వయస్సులో ఒకరిద్దరు స్త్రీలు అడవి పండ్ల రకాలను వేరు వేరు తాటాకు బుట్టలతో పెద్ద తట్టలో పెట్టుకొని, చివుకుల కృష్ణయగారింటి వద్ద నడివీధి గోడప్రక్కను పెట్టుకొని అమ్ముకునేవారు. ఒక వల్ల ముసలి దాని ముఖం, ఆమె పండ్ల కేక యిప్పటికీ నా మనోనేత్రాన కనబడుతోంది.

అప్పుడు డబ్బులు, అర్ధణాకాసులు (East India Company సింహాల ముద్రగలవి) పైసలు (దమ్మిడీలు) ఎర్రని రాగిలోహంతో చేయబడేవి. సోలెడు ధాన్యానికి మేమడిగిన సోలెడు పండ్లిచ్చేది ఆ వృద్ధ వనిత. 1921-22 గాంధీ ఉద్యమారంభం కాలానికి, ఉపాధ్యాయుడనైన నేను కొందరు పెద్దక్లాసు విద్యార్థులను వెంటదీసుకొని, రాజమండ్రి సమీపంలోని రిజర్వు ఫారెస్టుకు వెళ్ళి - గూడా కృష్ణమూర్తి, మద్దూరి కృష్ణమూర్తి, చావలి అచ్యుతరామయ్య, ముంజులూరి జనార్దనరావు, ఒంటెద్దు పార్వతీశం ప్రభృతులతోసహా - అడవి దారులలో ద్రిమ్మరి దొరికినంత మట్టుకు అడవి పళ్ళన్ని కోసుకొని తిన్నన్ని తిని, కొన్నిటిని సంచులలో నింపుకొని నీలిరంగు నాలుకలతో యింటికి చేరేవాళ్ళం.

నండూరి సుబ్బారావుగారినీ, పాటలను ఆలపిస్తూ ఆయన చేసే శారీరక నటనను, నేను మరచిపోలేను. పాటలను ఆయనే పాడాలి. 'గోవు

మాలచ్చిమికి కోటిదండాలు. మనిషి కైనా లేని మంచి పోకిళ్ళు!' అన్నది అంతబాగా పాడేవాడు గూడ కృష్ణ మూర్తి కూడ. నాకంటె చిన్న వాళ్లయిన ఈ శిష్యులెందరూ ఏనాడో నన్ను విడిచి వెళ్ళిపోయారు.

సూర్యరశ్మి ప్రభావం వృక్ష, జంతు, పక్షి, మానవ జీవితాల మీద అంతగావుంది. కారు చీకటింటో పెరిగే మొక్క ఏవైపు రంధ్రంగుండా సూర్యకిరణం లోపల ప్రవేశిస్తోందో కనిపెట్టి, ఆ వైపుకే సాదుతుంది. చీకటి మయమైన బురదలో పుట్టిన పద్మం అడుగునున్న ఆ బురదను, దానిపైనున్న నీటిని ఛేదించుకొని లేచి కమలాప్తుని దర్శనం కోసం నిరీక్షిస్తూ వుంటుంది.... ఇట్లా సృష్టికర్త మొదటి ఒకటి రెండు వర్షాలతో పాటు, ప్రతి యింటిదొడ్డిని బయళ్ళను గడ్డిపోచలతోను వేయిరకాల పుష్ప జాతులతో అలంకరిస్తాడు. మొదటి వర్షం పడిన ఒక వారంలోపలి చెంగల్వలు ఎపుడు చిగురిస్తాయా అని మేము కనిపెట్టికొని కూర్చోడం చిన్ననాటి నా రావులపర్రు అనుభవం. తరువాత నేనెప్పుడో యెరిగియున్న 'గుల్ షబ్' కూడ చెంగల్వవంటిదే. తొలకరి వానవచ్చి దానిని మేల్కొల్పుతుంది. చిన్ననాటి 'మధ్యాహ్నం - మంకెన్న' నా ప్రియ మిత్రాలలో ఒకటి. ఉదయమంతా ముడుచుకొని యుండి, సరిగా మధ్యాహ్న మయ్యే

సరికి వికసించే రూపాయసైజు ఎర్రని పువ్వు అది. రావులపర్రు యింటి దొడ్డిగుమ్మపు పందిరినిండా ఒకప్పుడు చూపట్టిన బీరపువ్వుల శతసంఖ్య తలపుకు వచ్చినపుడెల్ల నా మనసు తారాడుతూనే వుంటుంది.

ఏడెనిమిదేళ్ళవాడనై ఉంగుటూరు చదువులో పడ్డ తరువాత, మా యిల్లూ దొడ్లోనే పని. దొడ్లో యింటి చూరు నంటి మంచి యెఱ్ఱగుంజుపండ్ల జామ చెట్టుండేది. కొన్ని దోరకాయలను రామచిలక ముక్కున కరచుకొని ఎగిరిపోతుంటే ఒక్కొక్కకాయ కింద పడేది. అది కొంచెం కడుక్కొని పిల్లలం తినేవాళ్ళం. మా బుల్లితాతయ్య ముక్కు చివర కొనదేరియుండటంవల్ల ఆయనను చిలకముక్కు తాతయ్య అనేవాణ్ణి నేను. జామచెట్టుకు ఎదురుగా కొంచెం దూరంలో రెండు ఎత్తయిన నారికేళా లుండేవి. వాటికెడంగా ఎడమవైపున రెండు మూడు కూర అరటి చెట్లుండేవి. వాటి కెదురుగా కొబ్బరిచెట్ల వరుసనే రెండు చదరపు గజాలమేర మరీ చిన్నవి పెద్దవీకాని చేమంతిపూలమడి యుండేది. అరటి, చేమంతులకు ప్రతిదినం నీళ్ళుపోసి పెంచడం నా పని. అరటిచెట్ల వరసలో ఏ చింతగింజో మంటిలో కప్పి ఆ మర్నాడో మూడోనాడో మొలకెత్తిందో లేదో అని మట్టి పెకలించి చూచేవాణ్ణి. నీళ్ళు ఎక్కువ పోస్తే త్వరలో మొక్కవస్తుందని నా భావన. నా అజ్ఞానం చూచి మా అమ్మ కొన్ని విషయాలు నాకు బోధించేది - తోటకూర గింజలు మూడురోజుల్లో మొలకెత్తుతాయనీ, ధనియాలు రెండుబద్దలయ్యేటట్లు చెప్పుతో రాచి చల్లితే తొమ్మిది రోజులలో మొలకెత్తుతాయనీ యిట్లాతనకు తెలిసిన సంగతులెన్నో నాకు తెలియ జెప్పేది. ఆమె బోధయే నా కిప్పటికీ పని చేస్తోంది. అంతే కాపురమున్న యింటిదొడ్లోనో వాకిట్లోనో కాస్త మన్ను దొరికిన చోటల్లా యిదే నాపని. ఇక పెద్ద వృక్షాలతో నాకున్న సంబంధం, యింటి సమీపంలో చెరువు గట్టునుండిన రావి, జువ్వి చెట్లతో ప్రారంభమయింది. చిన్న వయస్సున పిట్టలతోను వాటికూతలతోను కొంత పరిచయం నాకుండెను. కోవెల గువ్వ, జెముడుకాకి, కంసాలి పిట్ట మున్నగునవి చూతామంటే కంటి కగపడవు. నీలాద్రిపురం తోటలో చెట్ల తోపుల మధ్యనుండి ఒక వింత ధ్వని వినిపించేది. పిట్టమాత్రం కనబడదు. అయినా పరీక్షపెట్టి చూచేవాణ్ణి. దట్టమైన ఆ చెట్లసమూహం లోపలనే ఒకచోటనుండి వేరొక చోటుకు ఎగిరేటప్పుడు క్షణమాత్రం అది కనబడేది.

దాని కూత సన్నగాను యింపుగానుగాక బొంగురుగా నుండి ఆ వయస్సులో నాకు భయం గొల్పేది. ఆ పక్షుల పేర్లు మాతండ్రి నడిగి నేను తెలుసుకోలేదు. కూతలు వినడంతో నా పని తీరిపోయేది. గువ్వకూత కొంచెం దీర్ఘమైనా వినసొంపుగా వుంటుంది. ఆ ధ్వనిలో రెండు స్వరాలుండటం వల్ల, దానిసొంపు ద్విగుణీ

కృతం. అప్పుడప్పుడు దానిని బహిరంగంగా చూస్తూవుండినా అదే 'గువ్వ' అని నాకు తెలియదు. 10, 12 ఏండ్లక్రితం పాలు తెచ్చిపోసే కుర్రవాడొకడు 'అదే తెలియదా? అదేగువ్వ' అని చెప్పాడు. అదొక discovery నాకు. దానిది బూడిద రంగు పావురంసైజు. 'గువ్వా గూడెక్కె, రాజా మేడెక్కె' అని పిల్లల నోటి పదమైనా గువ్వకు గూడున్నదని నాకు తోచదు. కోవెలకు గూడు నిర్మించుకునే నేర్పులేక కాబోలు కాకి గూట్లోనే గ్రుడ్లు పెడుతుందట. ఇవన్నీ వినికిడి విషయాలైనా విన్నంతవరకు నేను గుర్తుంచుకున్న సంగతులు. పుస్తక పాఠాల కంటే ఈసృష్టిపరిశీలన నా విద్యలో ఒక భాగం. సామాన్యంగా ఊరపిచ్చుకలు కాస్తగడ్డి లేక పీచు ముక్కున పోగుచేసుకొని గోడ రంధ్రాల్లోనో తాటాకు యిండ్ల కప్పుల లోపలి భాగంలోనో కాస్త సందు దొరికితే చాలు గూడు నమర్చుకొని అనుక్షణం దాని లోనికి వస్తూ పోతూంటాయి. మా పెదతండ్రి కొడుకు భీమేశ్వర్రావుది తాటాకు యిల్లు. పిచ్చుకల నడవడి వాటి అలవాట్లు పరీక్షించడానికి నేను కొంత పెద్దయిన పిదప కూడ కొంతసేపు అన్నయ్య యింటికి వెళ్లి ఈ దృశ్యాలను తిలకించేవాడను.

ఊరపిచ్చుకగాక, వేరొకరకమైన బంగారు పిచ్చుక' ఈత, తాడి, కుమ్మ (ఎక్కువగా 'ఈత') ఆకుల కొమ్మల కొనలను వ్రేలాడేటట్లు అల్లుకునే గూండ్ల చతురత చూచితీరాలి. ఆ ప్రావీణ్యం బట్టలు నేసే సాలెవానికి గూడ లేదు. సాలెపురుగు మనిషి కంటి కగపడకుండా అద్భుతంగా నిర్మించుకునే గూడొక్కటే దానికి సామ్యం. రైలు ప్రయాణంలో నున్నప్పుడు మార్గాని కిరుప్రక్కలా ఈ బంగరు పిచుక గూళ్లెక్కడ కనబడతాయాయని యిప్పటికీ చూస్తూంటాను. చిన్నప్పటి ఆకలి, ఆనందం యిప్పటికీ వదలలేదు.

నాకుండిన పక్షిమిత్రుల్లో కోడి (పుంజు, పెట్టకూడ) కోవెల, కాకి - యివి మూడు. కోడిపుంజు మిత్రుడు కాని దెవరికి? తెల్లవారు జామున మనిషికంటెను ముందులేచి గంటల లెక్కను రెండు మూడుసార్లు కూసి ప్రాణిలోకాన్ని మేల్కొల్పుతుంది కదా! ఎవరునేర్పిన అలవాటది! కేవలం నేర్చుకున్న పాఠమైతే ఒక్కొకసారి మరిచిపోవడం కూడ ఉంటుంది. "Before the cock crows tomorrow, you will deny me thrice!" అని క్రీస్తు నికరంగా పీటరుకు చెప్పిన జోస్యం. కోడి కూయడ మెంత సహజమో, ప్రభు వాక్యమూ అంతే! Aesops Fables ను మించిన కథలు మరేవీ మనిషిని రంజింపలేవంటారు వినోబావంటి జ్ఞానులు. ఏలనంటే అవి మనబుద్ధిని విశాల పరచి వికసింపజేసే నీతికథలు.... 1) చీమ - సోమరి రంగయ్య 2) కాకి నోటి మాంసపు ముక్క - చెట్టుక్రింద నక్క 3) నాలు

గెద్దలు - సింహం 4) సింహం - చిట్టెలుక 5) రెండు పిల్లుల మధ్య కోతి తీర్పు మున్నగు లెక్కకు మించిన ఉదంతాలనుండి మనం నేర్వవలసింది బోలెడంత వుంది. నేర్చుకున్నదేదో ఆ చిరుప్రాయంలోనే మేము నేర్చు కున్నాము. కాని మనుష్యుని వక్ర బుద్ధిని కుక్కతోక వంకరతో పోల్చారు.

మాట్లాడలేని మృగాలతో కథలల్లడ మేమిటని ఏ కుర్రవాడూ అనుకొనడు. Aesop's Fables వంటిదే 'పంచతంత్రం' తాము మాట్లాడుతూ తదితర ములచే మాట్లాడించడం - ఈ కథల ద్వారా జీవజంతువులు మనకుచేసే బోధ.

వీధిబడి మొదలు విశ్వవిద్యాలయం వరకూ నాకు లభించిన ఉత్తమ గ్రంథాలనుండియు వాటిని శ్రద్ధతో పఠింప జేసిన ఒజ్జలవల్లను పై Education for Life లోని సౌరభం నాకు తగిన మోతాదులో అబ్బింది అనవచ్చు.

## 8

## తణుకు హైస్కూలు

నన్ను తాడేపల్లిగూడెం తీసుకొని వెళ్ళి, అటనుండి ఒంటెద్దుబండి మీద తణుకు తీసుకొనివెళ్ళి అక్కడి తాలూకా బోర్డువారి విక్టోరియా మెమోరియల్ హైస్కూలులో చేర్చాడు - ఫోర్త్ ఫారమ్‌లో మేనమామ శేషయ్యగారు గ్రామకరణం కనుక ఆయనకు తాలూకా ఆఫీసుకు రావడం పోవడం కొట్టినపిండి. దారిలోనున్న దువ్వ గ్రామంలో కొంతసేపు బండి ఆపి, ఆ కరణంగారి యింట్లో నాకు అపరాహ్ణ భోజనం పెట్టించాడు. తణుకు స్కూలులో చేరిన కొద్దిరోజులకే చిన్న తిరుపతికి తీసుకెళ్ళి అక్కడ నా ఉపనయనం, నా పెద్దచెల్లెలు సుందరమ్మ వివాహం జరిపించడానికి ఏర్పాటయింది. మా హెడ్‌మాస్టరు చియస్. కృష్ణారావుగారు.

ఆ నాటి హెడ్‌మాస్టర్లలో సమర్థుడు, ప్రసిద్ధుడు. మద్రాసు ప్రాంతపు తమిళుడైనా తెలుగు ధారాళంగా మాట్లాడేవాడు. తన విద్యార్థిగణం పట్ల ఎంతో వాత్సల్యంతో నుండేవాడు. లెక్కల మాష్టరు నౌడూరి సోమయాజులుగారు, పిల్లల్ని కోప్పడి తన చేతిలోని పెద్దస్కేలు బద్దతోనే శ్రద్ధలేని పిల్లల్ని అప్పుడప్పుడు తగిలించేవాడు. కాని ఆయన లెక్కలలో నిధి. అయితే, ఆయన ఏమిబోధించినా లెక్కలంటేనే బెదిరిపోయే నాకేం ప్రయోజనం? దాక్షిణాత్యుడు కనుకనే యేమో హెడ్మాష్టరు ఆంగ్లభాషను గొప్పగా బోధించేవాడు. నేనొక వేసవిలో పది పన్నెండు రోజులు జ్వరపీడితుడనై లంఘనాలతో మంచానబడి యున్నాను. (ఇంకా వుంది



శ్రీ తల్లాప్రగడ రాజారామ్, గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ-521 123) సౌజన్యంతో....పుస్తకం వెల : రు. 20-00.







జులై 11, 1991

"'అల్లుడుగారు' నూరు రోజులు, 'అసెంబ్లీరౌడీ' నూటయాభై రోజులు ఆడుతుందని నేను వెనక అనడం, అహంభావంతో చెప్పిన మాట కాదు, ఆత్మ విశ్వాసంతో వెలిబుచ్చిన అభిప్రాయం. అపజయాలు రుచి చూసిన వాణ్ణి కాబట్టి చెప్పి చేయాలనిపిస్తూంటుంది. షిరిడీ సాయిబాబా సమక్షంలో కొత్త చిత్రం ప్రారంభించాను. జులై నాలుగో తేదీన బొంబయిలో పప్పీ లహరి సంగీత దర్శకత్వంతో సాంగ్స్ రికార్డింగ్ అయింది. అయిదు పాటలూ మీరు కొంచెం సేపట్లో వింటారు. పరుచూరి బ్రదర్స్ తయారు చేసిన ఈ స్క్రిప్టుని, దర్శకులు తమకు అనుకూలమైన రీతిలో మలుచుకోవచ్చు. ఛాయాగ్రాహకులు కెయస్ ప్రకాష్ ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. జులై పధ్నాలుగు నుంచి, చిత్తూరు జిల్లా పాకాలలో షూటింగ్ ప్రారంభమవుతుంది. నేను పదహారేళ్లగా మీ ప్రోత్సాహ సహకారాలు పొందుతున్నాను. మిమ్మల్ని కలుసుకు చాలా రోజులయింది. షూటింగ్‌లో తలమునకలయే ముందు, మీతో హాయిగా గడపాలని...." అంటూ 'ప్లెజంట్ ఈవినింగ్ విత్ పెన్ పాల్స్' (Pleasant Evening with Pen Pals) ఏర్పాటు చేశారు మోహన్‌బాబు, కొత్తగా వెలసిన 'రెసిడెన్సీ'లో. సవేరా, టాజ్, ఛోళా, పార్క్ షెరటాన్ అలవాటైపోయాయి పాత్రికేయులకు, ఇది సరికొత్తది. మోహన్‌బాబు తమ చిత్రం పేరు వెల్లడించి, 'ఆకర్షణీయంగా వుందా లేదా?' అని అడిగారు. "రౌడీగారి పెళ్లాం" లో "గారు" శబ్దానికి సూదంటురాయి లక్షణం ఉంది.... అయిదు పాటలలో రెండు హృదయ విదారకం, ఒకటి కవ్వింపు, మిగతా రెండూ శృంగార జనకం. 'అ ఆ లే రానట్టు అలవాటే లేనట్టు' (సిరి వెన్నెల), 'అకుందా - వక్కిస్తా, సున్నంతో పొక్కిస్తా' (రసరాజు), 'యమారంజు మీద వుంది పుంజు' (గురుచరణ్), 'కుంతీ కుమారీ - తన నోరు జారీ రాసింది ఒక భారతం; కన్యాకుమారీ తన కాలు జారీ - చేసింది నా జీవితం' (జాలాది), 'బోయవాని వేటుకు - గాయపడిన కోయిలా'

(గురుచరణ్).... చివరి రెండూ జేసుదాసు గానం చేయగా, మిగతావి బాలు, చిత్ర.... మోహన్‌బాబు, కోట శ్రీనివాసరావు, బాబు మోహన్, రాకీ, కాకరాల, ప్రసాద్‌బాబు, శోభన, అన్నపూర్ణ మున్నగువారున్న ఈ 'లక్ష్మీప్రసన్న' చిత్రానికి నిర్మాత : మోహన్‌బాబు ; నిర్వహణ : యమ్ కృష్ణ.... పిఆర్ఓ : ప్రమోద్ కుమార్.

..... 12

నిన్న సాయింత్రం 'మూవీ పారడైజ్'లో సమైక్య క్రియేషన్స్ (నిర్మాతలు : టి ప్రభాకర్, ఎన్ సుధాకర రెడ్డి ; సారథ్యం : ఎన్‌ఎ చౌదరి ; దర్శకత్వం : ఎ చంద్ర) వారి 'అతిరథుడు' పాటల ప్రదర్శన సంగీత దర్శకత్వం : రాజ్‌కోటి ; గేయరచన : సాహితి. భానుచందర్, నీరజ ముఖ్య జంట.... బాలు, నాగూర్ బాబు, చిత్ర, శుభల గాత్రం. మాల్‌గాడి, ప్రేమ ప్రేమ, చిన్నారి పొన్నారి, జో అచ్యుతానంద, ఒక గూటికి.... ఈ అయిదు పాటలూ గల కాసెట్‌ని శివరంజనీ ఎంటర్‌ప్రయిజెస్ (చల్లపల్లి బంగాళా కాంప్లెక్స్, ప్రకాశం రోడ్, విజయవాడ-2.... వెల : రు 25-00) విడుదల చేశారు. నాయికానాయకులు వేర్వేరు దుస్తులు మారుస్తూ పాడే పాటలు, ఆ సన్నివేశాలను బట్టి కొంత రక్తికడతాయేమో గాని కథా గమనానికి తోడ్పడవు. సినిమా విడుదలవటానికి ముందు, పాటలు ఒక విధంగా ప్రచార సాధనాలు. చూపించే పాటలన్నీ సగటు ప్రేక్షకుని మెప్పించే పద్ధతిలో ఉన్నాయి.... పిఆర్ఓ : రాజు.

..... 14

ఉదయం తొమ్మిదిన్నరకి 'పల్లవి'లో మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ వారు, విజయానికి, వినయానికి మారు పేరైన విజయశాంతికి, రాష్ట్ర జాతీయ స్థాయిలలో అవార్డు లభించిన సందర్భంగా అభినందన సభ ఏర్పాటుచేశారు. సెక్రటరీ జగన్ స్వాగతం తెలుపగా, అసోసియేషన్ అధ్యక్షులు జగదీష్‌బాబు, ఉపాధ్యక్షులు శ్రీనివాస్, విజయశాంతిగ్లామరస్‌గానే గాక ఉత్తమ నటిగా వర్ధిల్లాలనీ ఎప్పుడూ ఆమె చిరునవ్వులతో యింత సౌమ్యంగాను వుండాలనీ అన్నారు. 'కర్తవ్యం'లోని ఆమె పోలీసాఫీసరు పాత్రపోషణ (కిరణ్ బేడీ వరవడిలో) ఎందరినో ఆశ్చర్య చకితులు గావించిందనీ, తెలుగు చిత్ర పరిశ్రమకు ఖ్యాతి తెచ్చిన నటనా వైదుష్యం ఆమె కనబరిచారనీ, కపటం కల్మషం లేకుండా సూటిగా మాట్లాడే వ్యక్తి అనీ వ్యాస్‌చంద్, పసుపులేటి, అంజనేయశాస్త్రి, అర్జునరావు మున్నగువారు చెప్పారు....: "బాలచందర్, భారతీరాజాల ప్రోత్సాహంతో తమిళంలో ఛాన్సు వచ్చాక, టి కృష్ణగారొచ్చి 'నేటిభారతం'లో బుక్ చేయడంతో, నా నటజీవితాని కొక కొత్త మలుపు వచ్చింది. ఆ తర్వాత 'ప్రతిఘటన' నాకు పేరు

ప్రతిష్ఠలు తెచ్చింది. ప్రతిదీ దర్శకులు చెప్పినట్లు కరెక్ట్‌గానే చేశానని నాకు అనిపించవచ్చు. కాని నా పెర్‌ఫార బాగోగులు నిర్ణయించ వలసినది పత్రికా రచయితలైన మీరు. నేను కోరుకునేది ఒక్కటే - నాకు గర్వం రాకూడదని," - అన్నారు విజయశాంతి, తన గురించి జర్నలిస్ట్‌లు చెప్పిన మాటలకు సమాధానంగా....

ఆ తర్వాత తెలుగు చిత్ర పరిశ్రమ హైదరాబాదు తరలి వెళ్లడం గురించిన ప్రస్తావన వచ్చింది. 'దశాబ్దులుగా ఈ పరిశ్రమని నమ్ముకు, ఈ మహా నగరంలో మనుగడ సాగిస్తున్న సామాన్య సాంకేతికుల మాటేమిటి? ఆ చిన్నవాళ్ల సంగతి ఎవరూ ఎందుకు పట్టించుకోరు? పత్రికలు ఈ విషయమై ఘట్టిగా రాయాలి' - అన్నారు విజయ శాంతి. (తెలుగు సినిమా పరిశ్రమ యిప్పటికి మూడుసార్లు హైదరాబాదుకి తరలి వెళ్లింది - ఇది నాలుగో ప్రయత్నం)

అదే 'పల్లవి'లో సాయింత్రం నాలుగు గంటలకు తిరుపతి తిరుమల దేవస్థానం అధ్యక్షులు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి పత్రికా గోష్ఠి....

సాలీనా 105 కోట్ల రూపాయల ఆదాయం గల దేవస్థానమది. అంచేత, దానిని 'వాటికన్' అంత ఘనంగా మార్చి, హైందవ సంస్కృతికి ప్రతి రూపంగా చేయాలని సుబ్బరామి రెడ్డి సువర్ణ స్వప్నం. బంగారు కలలు పండవచ్చు, పండకపోవచ్చు. కాని, ఆ కలల నెవరూ ఆక్షేపించరు, తప్పు బట్టలేరు.... రెండు సంవత్సరాల క్రితం నవయుగా ఆఫీసులో జరిగిన పత్రికా గోష్టిలో ఒక జర్నలిస్ట్ 'విశాఖ పట్నం పార్లమెంటరీ నియోజకవర్గానికి కాంగ్రెస్‌వారు టికెట్ యిచ్చి మీరు నెగ్గితే, మంత్రి పదవి అభిలషించరా?' అని అడిగిన ప్రశ్నకు, 'మొదటి అయిదేళ్లూ అలాటిదేమీ అభిలషించను. పార్లమెంటులో ఎలా వ్యవహరించాలో నేర్చుకుంటాను. రెండవసారి ఎన్నికైతే అలాటి ఆశ కలగవచ్చు' - అని విస్పష్టంగా చెప్పారు సుబ్బరామిరెడ్డి (నెహ్రూ గారి కాలంలో రెండవసారి ఎన్నికైన వారికి తప్ప మంత్రి పదవి లభించేది కాదు - అది కూడా దిగువ శ్రేణిలో). ఈసారి విశాఖ టికెట్ బదులు, టి టి డి బాధ్యత ఆయనపై పడింది. సహృదయత, వాక్చాతుర్యం, సునిశిత దృష్టి, ప్రజాహిత చింతన గల వ్యవహార దక్షులు సుబ్బరామిరెడ్డి.... "టి టి డి అధ్యక్షునిగా నేను, ఎన్నో మంచిపనులు చేదామనుకుంటున్నాను. 1) రెండు సంవత్సరాల వ్యవధిలో ఏడున్నరకోట్లు వెచ్చించి తిరుపతి పట్నాన్ని శోభాయమానం చేయటం; 2) రెండుకోట్ల ఖర్చుతో ఊళ్లో రోడ్లన్నీ బాగుచేయించటం; 3) కళాతోరణాలుగా ఆర్చీలు నిర్మించి మొత్తం పట్నానికి ఒక రసాత్మక, ఆధ్యాత్మిక వాతావరణం కల్పించడం; 4) ఏభై ఏళ్లనాటి ధర్మ సత్రాన్ని, పదికోట్ల వ్యయంతో పునరుద్ధరించి, పునర్నిర్మించడం; 5) మూడు పెద్ద కళ్యాణ మండపాలు కట్టించడం; 6) బిచ్చగాళ్లకు పునరావాసం కల్పించి, వారికి ఉచిత భోజన సదుపాయం; 7) కోటి రూపాయిలతో స్వామివారికి బంగారు రథం తయారు చేయించడం; 8) ప్రస్తుతం 18 వేల మందికి మాత్రమే నివాస సౌకర్యం ఉంది - రోజూ నలభై వేల మంది వస్తూంటారు. కనీసం మరొక పది వేలైనా రూమ్స్ కావాలి. దఫాలు వారీగా ఈ నిర్మాణానికి పదిహేడున్నర కోట్లు కేటాయించడం; 9) ఒక పెద్ద మ్యూజియమ్ ఏర్పరచవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది - దానికి మూడు కోట్లు; 10) అనాథ శరణాలయం, వయోవృద్ధుల వసతి గృహం - యిలాటివి కూడా నిర్మించవలసి వుంది. ఇంకా చాలా వున్నాయి.... రాజకీయ దుమారాలు ఈ పుణ్య క్షేత్రాన్ని తాకకుండా చూడాలని నా తపన" - అన్నారాయన. హెలీపాడ్, రోప్‌వే వంటివి ఆయనకు యిష్టం లేదు.... ఆ తర్వాత, జివి అయ్యర్ దర్శకత్వంలో (నిర్మాత: టి సుబ్బరామిరెడ్డి) రూపొందుతున్న 'భగవద్గీత' (సంస్కృతం) గురించిన

ప్రస్తావన వచ్చింది. విషాదయోగం నుంచి, సాంఖ్య కర్మ జ్ఞాన, భక్తి, పురుషోత్తమప్రాప్తి, మోక్ష సన్న్యాస యోగాల దాకా, పద్ధెనిమిది సోపానాలలో నరునికి నారాయణుడు చేసిన బోధ తరతరాలుగా ఎందరో మహాను భావులకు వేగుజుక్క అయింది. ఇప్పుడది దేశ దేశాల ప్రజను బాలమురళీ కృష్ణ సంగీత లహరితో ఆయా దేశాలవారి భాషల సబ్ టైటిల్స్‌తో రసానంద లోకాన విహరింపజేయనున్నది.... పిఆర్ఒ : గీతా సుబ్బారావు.

"కళాసాగర్ 19 వ వార్షికోత్సవ సందర్భంగా పదిహేడవ ఫిలిమ్ క్రిటిక్స్ అవార్డ్స్ ఫంక్షన్‌లో పాల్గొనడం నాకెంతో సంతోషంగా ఉంది.... 'రాజా హరిశ్చంద్ర'తో ప్రారంభమైన భారతీయ సినిమాకు 79 ఏళ్లు నిండాయి ; మొదటిటాకీ 'ఆలమ్ ఆరా' వచ్చి అరవై ఏళ్లయింది. దేశం మొత్తం మీద వున్న సినిమా హాల్సులో 60 శాతం దక్షిణ భారతంలో వున్నాయి ; దేశం మొత్తం మీద విడుదలయే చిత్రాలలో 75 శాతం దక్షిణ భారతంలో తయారవుతున్నాయి. సాంస్కృతికంగా సినిమాకు గల ప్రభావాన్ని తక్కువగా అంచనా వేయకూడదు. సమాచార వ్యాప్తి, బోధనావకాశం, వినోదం - ఈ త్రివిధ మార్గాన ప్రజోపకారి కాగల సాధన యిది. ఏ కళాకారుడైనా తను జీవిస్తున్న సమాజంలో అంతర్భాగం గాక తప్పదు. సామాన్యుల నడవడికకు, వారి విలువల రూప చిత్రణకు ఉదాత్తత వొనగూరుస్తూ, మంచిని పెంచాలే తప్ప, దౌర్జన్యాన్ని రక్తదాహాన్ని గ్లామరైజ్ చేసి, లేత మనసులని భయోత్పాతానికి లోను చేయకూడదు. కుటుంబము, కుటుంబ జీవనమూ, కుటుంబ వ్యవస్థ సంఘంలో ఒక భాగమై ఎలా సాగుతున్నదీ - యిటువంటివి, మనదైనందిన జీవితాలకు చేరువగా వున్నవి,

కళాత్మకతతో, వెండి తెరపై కనిపింప జేసినప్పుడే, నిర్మాత తన సామాజిక బాధ్యత నెరవేర్చిన వాడవుతాడు" - అన్నారు తమిళనాడు గవర్నరు భీష్మ నారాయణసింగ్, మ్యూజిక్ అకాడమీ లో.... గంగై అమరన్ ఆర్కెస్ట్రాతో ఇళయరాజా సంగీత విభావరి అరుం బావుకి ప్రారంభమయింది. యస్పీ బాలసుబ్రహ్మణ్యం, ఇళయరాజాల చతురోక్తులతో, బాలూ చిత్రాల పాట లతో కార్యక్రమం ఎంతో రక్తికట్టి, శ్రోతలను సంతోష పరిచింది.... సిరి వెన్నెల సీతారామశాస్త్రి కంపీర్ చేశారు; యమ్మెస్ రెడ్డి అధ్యక్షులు. తమిళనాడు గవర్నరు కళాసాగర్ అవార్డులు ఆయా బహుమతి గ్రహీత లకు అందజేశారు. ఉత్తమ చిత్రం: సీతారామయ్యగారి మనవరాలు - నిర్మాత: దొరైస్వామి రాజు; ఉత్తమ నిర్మాత: రామోజీరావు; ఉత్తమ దర్శకుడు: క్రాంతికుమార్; ప్రత్యేకంగా: మోహన్ గాంధీ; ఉత్తమ నటుడు: అక్కినేని నాగేశ్వర రావు; నటి: విజయశాంతి; ప్రత్యే కంగా: మీనా; కారెక్టర్ యాక్టర్: పుండరీకాక్షయ్య; యాక్ట్రెస్: వాణిశ్రీ; హాస్యనటుడు: మాడా; హాస్యనటి: శ్రీలక్ష్మి; కథ: పరుచూరి బ్రదర్స్ - కర్తవ్యం; సంభాషణలు: పరుచూరి బ్రదర్స్; ప్రత్యేకంగా: గణేశ్‌పాత్రో; గేయరచయిత: గురుచరణ్; నేపథ్య గానం - పురుషగాత్రం: యస్పీ బాల సుబ్రహ్మణ్యం; స్త్రీ గాత్రం: చిత్ర; సంగీత దర్శకత్వం: ఇళయరాజా; కెమెరా: సరోజ్‌పాడి; ఎడిటర్: గౌతమ్‌రాజ్; జ్యూరీ అవార్డ్: విద్యా సాగర్.

## ..... 18

అమెరికన్ సివిల్ వార్ (అంతర్యు ద్ధం) 1861 నుంచి నాలుగేళ్లపాటు జరిగింది. 'దక్షిణ కరొలినా', మరొక పది దక్షిణాది రాష్ట్రాలతో కలిసి, యూనియన్ నుంచి విడిపోయి 'కాన్ఫెడరసీ' ఏర్పరచడంతో, ఉత్తర (యూనియన్) దక్షిణాల (కాన్ఫెడరసీ) మధ్య యుద్ధం అనివార్యమయింది. బానిసత్వ నిర్మూ లన కోసం ఉత్తరం, తమ పత్తి తోటలలో పనిచేసేందుకు బానిసలు కావాలని దక్షిణం పోరాటం సాగించి నట్లు పైకి స్థూలంగా కనిపించినా, అసలు కారణాలు అంత సింపుల్ కాదు. దృక్పథాలలోని వైవిధ్యం, ఆర్థిక ప్రయోజనం, రాజకీయ ప్రభా వం - ఈ మూడూ దోబూచులాడుతూ, రిపబ్లికన్ అభ్యర్థిగా అబ్రహిమ్‌లింకన్ అధ్యక్ష స్థానానికి రావడంతో పరాకాష్ఠ నందుకున్నాయని అంటారు .... తొమ్మిది భాగాలుగా అంత ర్యుద్ధం డాక్యుమెంటరీ, అమెరికన్ సెంటర్‌లో ఆహ్వానితులకు చూబు తున్నారు యివ్వాళనుంచి.... వారానికి ఒకటి రెండు అధ్యాయాలు చొప్పున ప్రదర్శిస్తారు. ఇవ్వాళ చూపిస్తున్నది 'ది కాజ్' (The Cause - 1861 - 99 ని॥).... 'ఒక నవల చదువు తున్నట్టు, ఒక విషాదగాథను మిత్రుడు

చెబుతున్నట్టు మనసు ద్రవీభూతమవుతుంది. ప్రాచీన చిత్తరువులు, కట్టడాలు, లేఖలు, సన్నివేశాలు నుంచి ఈ డాక్యుమెంటరీకి జీవస్పందన తెప్పించారు' - అని ప్రశంసించింది 'వాషింగ్టన్ పోస్ట్'.... శ్వేతవర్ణునికీ, నీగ్రో స్త్రీకి జన్మించిన ఫ్రెడరిక్ డగ్లస్ 1831 లో, బానిసలను కొనడం, అమ్మడమనే దురాచారం సమసిపోవాలని మొదటిసారి బహిరంగ ప్రకటన గావించాడు. ఆ తర్వాత శ్వేత ఛాదరీలు కొందరు ఈ ఉద్యమంపై సానుభూతి చూపించారు. 'హారియట్ స్టవ్' రచించిన నవల 'అంకుల్ టామ్స్ కాబిన్' (1857) దేశవ్యాప్తంగా దుమారం లేవదీసింది. జాన్ బ్రౌన్ అనే పత్రికా సంపాదకుడు బానిసత్వ నిర్మూలన వైపుగా మొగ్గుచూపడం సహించలేని దుందుడుకు వాదులు కొందరు, ఆయన ప్రింటింగ్ ప్రెస్సూ ఆఫీసూ తగలబెట్టారు. పారిశ్రామికంగా ముందడుగు వేస్తున్న ఉత్తరాది రాష్ట్రాలకు బానిసల అవసరం లేదు. సేద్య భూములపై ఆధారపడ్డ దక్షిణాది రాష్ట్రాలకు బానిసలు లేనిదే రోజు గడవదు - చాకిరీ చేసే బలగం







ఉండదు. ఇప్పుడు తలుచుకుంటే తమాషాగా ఉంటుందిగాని అప్పట్లో డెమొక్రాట్లు, బానిసత్వ నిర్మూలనకు వ్యతిరేకులు. యూనియన్ ప్రభుత్వం లో డెమొక్రాట్లు, రిపబ్లికనులు ఈ విషయమై ఏకాభిప్రాయానికి రాలేక పోవడమే, అంతర్యుద్ధానికి దారి తీసిందంటారు. 1860 నవంబరులో అబ్రహామ్‌లింకన్ అధ్యక్షుడయాడు; 1861 వేసవిలో ఉత్తర దక్షిణాల మధ్య యుద్ధం ప్రారంభమయింది. యూనియన్ నుంచి విడిపోయి వేరే ప్రభుత్వం (కాన్ఫెడరసీ) ఏర్పరుచు కుంటామంటే, తిరుగుబాటుదారులను శిక్షించకుండా యూనియన్ ఎలా ఊరుకుంది? ఈ ద్రోహకచర్య విరమించకపోతే, శిక్షిస్తానంది. ఈ బెదిరింపులకి భయపడితే, మేము తిరుగుబాటే చేసి వుండే వారముకాము - అన్నాయి దక్షిణ రాష్ట్రాలు. శ్వేత వర్ణుల పోరాటమే తప్ప, ఇందులో నీగ్రోలు లేరు, నీగ్రో సేనలు లేవు, నీగ్రోల ప్రమేయం లేదు.... పారి శ్రామికీకరణ పొందుతున్న ఉత్తర రాష్ట్రాలూ, భూసంపదపై ఆధారపడ్డ దక్షిణ రాష్ట్రాలు బలా బలాలు చూసు కునేందుకు ఆరంభమయింది ఈ అంత ర్యుద్ధం.... ఇంకా ఎనిమిది భాగాలు వుంది; ఇది మొదటి మాత్రమే.

.....19

మద్రాసు తెలుగు అకాడమీ వారి జాతీయ సమైక్యతా ఉత్సవాలు వియస్‌టి ఇండస్ట్రీస్ సహకారంతో, మద్రాసు మ్యూజిక్ అకాడమీలో టంచన్‌గా సాయింత్రం అయిదు గంటలకి 'ఛైల్డ్ ప్రాడజీ' శశాంక ఫ్లూట్‌తో ప్రారంభమయాయి. వయొలిన్ మైసూరు నాగరాజు, మృదంగం పాల్‌ఘాట్ రఘు, కంజీరా హరి శంకర్. ఆరుగంటలకు ముఖ్య అతిథి వచ్చేదాకా శ్రోతలు ఆ గానలహరిలో మునిగి వున్నారు. అకాడమీ రథ సారధి టివికె శాస్త్రి, ఈ ఫెస్టివల్ లక్ష్యమూ, సంగీతనాట్యాల ద్వారా దేశంలోని పలు ప్రాంతాలని ఏవిధం గా సమైక్యపరిచి, సమగ్రతాయాత్రకు దోహదం చేస్తున్నదీ తెలిపారు.... "జాతీయ సమైక్యతకు ఈ మద్రాసు తెలుగు అకాడమీ గత పదేళ్లగా మ్యూజిక్ అండ్ డాన్స్ ద్వారా చేస్తున్న కృషి ఎంతో హర్షదాయ మైనది. ఒక సున్నిత భావాన్ని రసార్ద్రతతో అందంగా అనువదించ గలిగేవి సంగీత నాట్యాలు మాత్రమే. ఎందరు పరదేశీయులు ఈ భరత భూమిపై కాలిడినా, ఏకత్వంలోని భిన్నత్వాన్ని సంరక్షించుకోగల నైపుణ్యం, మనోధృతి ఈ దేశ ప్రజలకు మొదట్నుంచి వుంది. దక్షిణ భారతంలోని భరతనాట్యం, కూచిపూడి, కథాకళి సంప్రదాయ సరళికి చెందినవైతే, కోలాట్టమ్, కావడి, కరగమ్, కుదురై ఆట్టమ్ వంటివి తమిళనాడులోని జానపద నృత్యాలు. త్యాగరాజు తన సంగీత ఝరితో దక్షిణ భారతాన్ని పునీతం చేశారు.... ఎందరో మహానుభావులు

- అందరికీ వందనములు" - అన్నారు తమిళనాడు గవర్నరు భీష్మనారాయణ సింగ్.... ఆ తర్వాత నాగై వయొలిన్, వెల్లూరు రామభద్రం మృదంగంతో ప్రముఖ సంగీత విద్వాంసులు మహారాజపురం సంతానం, అక్షరాలా వీనులకు విందు చేశారు.

. . . . . 20

ఇవ్వాళ మద్రాసు తెలుగు అకాడమీ ఫెస్టివల్‌లో పండిట్ జస్‌రాజ్ హిందూస్థానీ గాత్రం, టియన్ కృష్ణన్ వయొలిన్, ఉస్తాద్ అమ్జద్ ఆలీఖాన్ సరోద్ - జుగల్‌బందీ (మృదంగం తిరువారూర్ భక్తవత్సలం, తబ్లా సుఖ్ విందర్ సింగ్ నామ్‌ధన్). ముఖ్య అతిది: శిరోమణీశర్మ (కేంద్రంలో పరిశ్రమల శాఖ కార్యదర్శి); స్వాగత వచనం: పారిశ్రామిక వేత్త ఓబుల్‌రెడ్డి.... లోగడ నాలుగుమూడు సార్లు విన్నప్పటికీ మళ్ళీమళ్ళీ వినాలనిపించే గానామృత రసార్ణవమది. అయితే ఇవ్వాళ మరొక చోటికి తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చింది.... పానగల్ పార్కు దగ్గిరున్న వెంకటేశ్వర కళ్యాణ మండపంలో కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి 'సూత పురాణం' ఆవిష్కరణ; తెలుగు యూనివర్సిటీ వారు ఈ మధ్యనే దీనిని పునర్ముద్రించారు. హైదరా








బాదు టాంక్‌బండ్ మీదున్న శిలా విగ్రహాలలో కవిరాజుది కూడా ఉంది. సభాధ్యక్షులు కొత్త లక్ష్మీ రఘురామ్, తమ తండ్రిగారికాలంలో కవిరాజుతో తమ కుటుంబానికి గల పరిచయం, ఆ సమవయస్కుల సాన్నిహిత్యం చెప్పారు. పుస్తక సమీక్ష గావించిన ప్రొఫెసరు లలిత, 'ఈ గ్రంథంలోని అంశాలు వివరిస్తున్నానేగాని నా అభిప్రాయం చెప్పడంలేదు' - అన్నారు. రామస్వామి చౌదరి బ్రాహ్మణద్వేషి అనే అపవాదు వుంది; అది ఎంత మాత్రం నిజం కాదు - అన్నారు కార్యక్రమ నిర్వాహకులు బియస్సార్ కృష్ణ. 'పురాణాలన్నీ కల్పనలే; ఆ కల్పనల గురించి విమర్శ దేనికి? రాముడూ కృష్ణుడూ నిజంగా జీవించిన చారిత్రక పురుషులా? కవిరాజులోని తిరుగుబాటు తత్వం, ఆ విప్లవభావం, అన్నిటికీ తలవూపడంగాక ప్రశ్నించే నైజం, ఆ విప్లవాగ్ని ఈనాడు కనిపించదెందువల్ల? ఆ ప్రాంతాలు వెనకటి కంటె వందరెట్లు ఐశ్వర్యవంతమయాయి. కాని, ఆ విప్లవాత్మక దృక్పథం కించిత్తు కూడా కన్పించదు ....నాలుగేళ్ల క్రితం కవిరాజు పేరిట లక్షరూపాయల నిధి సేకరించి, నాగార్జున యూనివర్సిటీకి సమర్పిస్తామన్నారు. అది ఏమయింది? ఈ ఉపన్యాసాలకంటె ఆయన గౌరవార్థం, ఆయన రచనలపై పరిశోధనాత్మక కృషి జరిపేందుకు అటువంటి నిధి ఎంతో ఉపయోగకారిగా ఉంటుంది'- అని సూచించారు బెజవాడ గోపాల రెడ్డి. గోపీచంద్‌తోగల పరిచయం, హైదరాబాదులోని ఆర్య సమాజ్ గురించి డాక్టర్ బాజీ చెప్పాక, త్రిపురనేని వెంకటేశ్వరరావు తమ తాత గారి గురించి దీర్ఘోపన్యాసం చేస్తూ, 'వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో చెప్పరే' అనేది తమ మేనత్త ఫిడేలు మీద వాయించారనీ, కవిరాజుకి జస్టిస్ పార్టీతో సంబంధం లేదని, ఉన్నవ లక్ష్మీనారాయణకు మల్లేనే సిసలైన దేశభక్తులనీ, అంధ విశ్వాసాలపై ఆయన అవిశ్రాంత పోరాటం సాగించారనీ చెప్పారు.... తమిళనాడు రామస్వామి నాయకర్‌ని, తెనాలి వాసులైన రామస్వామి చౌదరిని పోల్చడం సముచితం కాదు; ఎవరి కార్యక్షేత్రం వారిది. ఇరువురూ మూఢనమ్మకాలపై ధ్వజమెత్తినా, ఒకరు ఆత్మగౌరవం (సెల్ఫ్ రెస్పెక్ట్) ప్రధానమన్నారు; మరొకరు వైవాహిక క్రతువులోని మంత్రాల భాష మార్చమన్నారు.

..... 21

కద్రి గోపాలనాథ్ సాక్సాఫోన్, నర్సింహులు వాద్యితి క్లారినెట్‌ల జుగల్‌బందీ సరిగ్గా నాలుగు గంటలకు ప్రారంభమయింది మ్యూజిక్ అకాడమీలో. మద్రాసు తెలుగు అకాడమీ వారి మూడురోజుల పండగలో యిది చివరి రోజు. 'మనం కొంచెం ముందు వెళ్తే గాని సదుపాయం వుండే సీట్లు దొరకవు' అని చెప్పే నా విన్నపాన్ని, మాలతి

యివ్వాళ ఆలకించింది - తన ఫ్రెండు నందినీరావు కూడా వస్తూండటంవల్ల! జుగల్ బందీ తర్వాత ఆంధ్రా సిస్టర్స్ షణ్ముగప్రియ, హరిప్రియల కర్ణాటక గాత్ర సంగీతం (వయొలిన్ చంద్రశేఖరన్; మృదంగం బెంగుళూరు అర్జున్ కుమార్; ఘటం కార్తిక్). రాధా జయలక్ష్మి వద్ద శిక్షణ పొందిన ఈ అమ్మాయిలిద్దరూ (ఒకరు 19, మరొకరు 17) అయిదవ ఏట నుంచీ సంగీత సాధన చేస్తూ, తలిదండ్రుల ఆశలకు (తండ్రి: వివి సుబ్బారావు, చిత్తూరు - స్వస్థలం : అమలాపురం) రూపమిచ్చి మెప్పు పొందుతున్న నవయువతులు. ప్రతి పాటా ఎంతో శ్రావ్యంగా పాడారు; శ్లోకాలు చదువుతున్నప్పుడు మీనాక్షిని సాక్షాత్కరింపజేశారు. 'ఉయ్యాలలూగుమా శ్రీ సత్యసాయీ - ఆత్మడోలికలోన ఆనంద దాయీ' అంటున్నప్పుడు 'తనువెల్ల హాయిగానే కాదు, మనసెల్ల మందార మకరందం తో' నింపారు. తెలుగుపాట ఈ ప్రియాసిస్టర్స్ కంఠంలో, తీయదనం తెమ్మకు సొగసులు పోయింది. జన రంజనతోబాటు విద్వాంసుల దీవనలు అందుకో గలగాలి వీరిద్దరూ! పండిట్ జస్‌రాజ్‌కీ, న్యూఢిల్లీ కథక్ కేంద్ర బిర్జు మహారాజ్‌కీ, జీవన్ పాణికీ, పూలజల్లులో కిరీట ధారణతో ఘన సన్మానం జరిగాక, కేంద్ర సమాచార కార్యదర్శి కెవి వరదన్ (చిన్నప్పుడు ఈ మైలాపూర్‌లోనే చదువుకొని, కొన్నాళ్లు టీచ్ చేసి, ఐఏయస్ అయిన

...యగి), 'మద్రాసులో హిందూస్థానీ సంగీతం, న్యూఢిల్లీలో కర్ణాటక సంగీతం పొందుతున్న గౌరవాభిమానాలు, ఆదరణ కళ్లారా చూస్తున్నాను. స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్ వారి బేనర్‌లోని ఆ పక్షుల వలె సంగీతం నలుదెసలకూ సాగుతూ, హృదయాకాశాన్ని స్పృశిస్తూ, ఎల్లలెరుగని నాదోపాసనతో రసోద్దీపన కలిగిస్తూ, ఈ దేశం, ఈ సంస్కృతి, ఈ స్రవంతి ఒకటి సుమా - అని చెబుతున్నది. సమగ్రత, సమైక్యతల సాధనకు సంగీత నాట్యాదుల ద్వారా టివికె శాస్త్రీజీ చేస్తున్న కృషి అసాధారణమూ, అద్భుతమూ' - అన్నారాయన.... కథక్‌నృత్యంతో ఫెస్టివల్ ముగిసింది.... మద్రాసు తెలుగు అకాడమీ ఛెయిర్‌మాన్ పి ఓబుల్‌రెడ్డి, ప్రెసిడెంట్ యస్ జానకి, యితర కార్యకర్తలు, ప్రయోక్తలు జయాశేఖర్, జయంతీ సుబ్రహ్మణ్యం మున్నగువారు, పేరు పేరునా చెప్ప నవసరంలేని ఎందరో శ్రేయోభిలాషులు అంకిత భావంతో ఈ ఉత్సవ విజయానికి తోడ్పడ్డారు. 'ఇందరు కలిసి నన్ను ముందు నిలబెడుతున్నారు గాని యిటువంటి బృహత్కార్యం నా ఒక్కడి వల్ల అయేపనా?' - అంటారు టివికె శాస్త్రి. ఆ ఆత్మశోధనే ఆయన విజయ పతాక.

..... 22

ఛిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు వ్యవస్థాపకులు - యశశ్శరీరులు శర్మా దంపతులకు ముగ్గురమ్మాయిలు. పెద్దమ్మాయి గీత, చివరమ్మాయి శకుంతల విద్యాలయానికి అంకితమయారు. మధ్యమ్మాయి రుక్మిణి యిరవై యిరవై రెండేళ్ల క్రితం విఆర్ పప్పుని వివాహమాడింది. దంప్రతులకి ఏ అసెంబ్లీ హాలులో వివాహం జరిగిందో (అప్పట్లో శర్మా దంపతులు పీటలమీద కూచున్నారు: వొంట్లో అనారోగ్యంగా వుండటంవల్ల శర్మగారు చొక్కామీద యజ్ఞోపవీతం వేసుకున్నారు), అదేచోట సౌ॥ శాంతి, చి॥ అభిజిత్‌ని (వరుని తండ్రి యస్‌సి ఘోష్, కలకత్తా శాంతినికేతన్‌లో ప్రొఫెసరు), ఆధునిక పద్ధతిలో రిజిస్టర్డ్ మ్యారేజ్ చేసుకుంది. పెళ్లి ప్రమాణాలు, వైవాహిక తంతూ ఆదర్శప్రాయంగా వున్నాయి. ముఖద్వారమూ, కళ్యాణ వేదిక ఎంతో చక్కగా ముచ్చటగొలిపేటట్లు అలంకరించారు. ఉదయం శుభకార్యానికి దగ్గిర బంధువులు, సన్నిహితులు వచ్చారు. సాయింత్రం వుడ్‌లాండ్స్‌లో రిసెప్షన్‌కి మాత్రం వందలూ వేలూ సంఖ్యలో వచ్చి, శాంతీ అభిజిత్‌లకు శుభాకాంక్షలు తెలిపారు. విద్యా వినయరూప సౌశీల్యాలుగల ఈ నవ దంపతులకు మా శుభాశీస్సులు.

..... 25

అమెరికన్ అంతర్యుద్ధం డాక్యుమెంటరీలోని రెండవ అధ్యాయంపేరు 'రక్తసిక్త దుర్ఘటన' (A Very Bloody Affair - 1862; 69

minutes) రష్యాలోని జార్ ప్రభువు 'సెర్ఫ్'లకు విమోచన కలిగించాడు. 32 వేల సేనతో జనరల్ మాక్లీన్ వర్జీనియాలోకి వెళ్లి 22 వేల విప్లవ సేనకు ఓడిపోవలసి వచ్చింది. ఇరు పక్షాలూ 90 రోజుల యుద్ధవిరమణ. 'షిలో' యుద్ధంలో 2477 హతు లయారు; 23,000 గాయపడ్డారు. విప్లవ సేనలలో యుద్ధకౌశలం కని పించసాగింది; ప్రభుత్వ సేనలలో చేరుతున్నవారు పదిహేనూ పద్దెనిమి దేళ్లవారు; వీరందరూ దేశభక్తితో ముందుకురికారనుకోవటం శుద్ధ పొర పాటు. కాలక్షేపం, భుక్తి గడవడం, గుర్తింపు, యడ్వంచర్ - యిలాటివి. 42,000 వెస్ట్ పాయింట్‌లో సైనిక శిక్షణ పొందుతున్నారు. ఇలా వుండ గా, ఒక యుద్ధ నిపుణుడు, మిసిసిపీ నది ఎవరి స్వాధీనంలో ఉంటుందో విజయం వారిని వరిస్తుందని నిదర్శ లతో చూపడంతో లింకన్, నౌకా వ్యూహానికి అవసరమయే ఓడల నిర్మాణానికి పూనుకోమన్నాడు. లోన ఫిరంగులతో వలయాకారంగా వుండే నౌకను నిర్మించడం, ప్రభుత్వ పక్షాన ప్రథమ సాంకేతిక విజయం. మిసిసిపీ నదిలోని విప్లవ నౌకలకు దీనిని ఎలా ఏవిధంగా ఎదుర్కోవాలో బోధపడ లేదు. అంతేగాక ప్రభుత్వసేనలు ఆక్రమిత ప్రదేశాలలోని బానిసలకు విముక్తి ప్రసాదిస్తాయనే లింకన్ ప్రక టన, ఒక బాంబ్‌షెల్ అయింది. సైనిక పరంగా యూనియన్ తగుముఖంలో వున్నప్పుడు, 'కాన్ఫెడరసీ'ని యూరప్ లోని దేశాలు గుర్తింపనున్నాయనే వార్త వస్తుంది.

అయిదుంపావు దాకా ఆడిటోరియ మ్‌లో పిక్చర్. అయిదున్నరకి 'వరల్ నెట్ డైలాగ్' సెమినార్ రూమ్‌లో. (Worldnet Dialogue - 'The impact of the Gulf war on the Global Environment') ప్రపంచ పర్యావరణం మీద గల్ఫ్ యుద్ధ ప్రభావం. గత పధ్నాలుగేళ్లుగా అంతర్జాతీయ పర్యావరణ పరిశోధన లో ఉన్న శాస్త్రవిజ్ఞాని రాబిన్సన్, మద్రాసు నుంచి, బొంబయి నుంచి అడిగే ప్రశ్నలకు వాషింగ్టన్ నుంచి సమాధానం చెబుతారు. (మద్రాసు నుంచి సుందరేశన్ (నాగ పూర్ పర్యావరణ పరిశోధక సంస్థ మాజీ డైరక్టరు), సిఎ శాస్త్రి (మద్రాసు ఐఐటి కెమికల్ ఇంజనీరింగ్ శాఖ ప్రొఫెసరు) పాల్గొన్నారు. వీరు మనకు ఎదురుగా కూర్చునివుంటారు - వారు అడిగే ప్రశ్నలు వినిపిస్తాయి; బొంబయివారు కనిపించరు; కాని ప్రశ్నలు వినిపిస్తాయి. వాషింగ్టన్ నుంచి రాబిన్సన్ వీడియోలో కనిపిస్తూ అడుగుతున్న ప్రశ్నలకు జవాబు చెబు తారు (ఈ ఏర్పాటంతా సాటిలైట్ ద్వారా).... గంటసేపు జరిగిన ఈ సంభాషణలో పర్యావరణానికి సం బంధించిన విషయాలనేకం వచ్చాయి .... 1991 ఫిబ్రవరి 22 నాటికి కువైత్‌లోని 150 చమురునూతులు మంటలపాలై భయంకరమైన పొగలు చిమ్మటం ప్రారంభించాయి. ఒకటి

రెండు కిలోమీటర్ల దట్టంగల ఈ నల్లటి పొగలు, గాలి వాటాన్నిబట్టి టర్కీ, ఇరాక్, ఇరాన్‌ల వైపు సాగి పర్వతశ్రేణులపై పేరుకున్నాయి. ఈ నల్ల మేఘాలు వాతావరణంలో ప్రయాణించడమనేది రెండు రోజుల నుంచి ఏడు రోజులదాకా సాగడం, చూసిన వారున్నారు. 'ఆయిల్ స్లిక్' సముద్రంలోని జీవరాసులని పొట్ట నెట్టుకు దిగువకు ఎలా వెళ్లినదీ, సముద్ర జలాలను ఎలా కలుషితం చేసినదీ టివిలో మీరు చూసే వుంటారు. ఋతుపవనాలమీద, వర్షపాతం మీద ఈ నల్లమేఘాల ప్రభావం ఉంటుందా ? - అన్న ప్రశ్నకు, అటువంటి దేమీ యింతవరకూ కనిపించడంలేదన్నారు రాబిన్సన్. హిమవత్పర్వతం మీద మంచు నల్లబడటం విషయంలో ? - అనే ప్రశ్నకు, 'జరిగితే జరగవచ్చు, జరగదు అని మాత్రము చెప్పలేము - అన్నారు.... 'సద్దామ్ హుస్సేన్, కువైత్‌లోని చమురు నూతులు తగలబెడితే ఏర్పడగల పర్యావరణ కాలుష్యం గురించి 1988 లో లండన్‌లోని ఒక వైజ్ఞానిక సమితి [Scientific Committee on Problems of the Environment - SCOPE] పరిశీలనలు జరిపిందట. జోర్డాన్ రాజొక్కడే ఈ కాలుష్యం గురించి ప్రథమ హెచ్చరిక చేసిన పెద్ద మనిషి.

. . . . . 27

పొట్టి శ్రీరాములు హాలులో అభ్యుదయ రచయితల సంఘంవారి సాహిత్య సభ : రాంచీలోని ఒక పబ్లిక్ సెక్టార్ సంస్థలో పనిచేసి, రిటైరై, ఏడాదీ ఏడాదిన్నర క్రితం మద్రాసు వచ్చి సెటిలైన పివియల్ నరసింహారావు (పోతరాజు వెంకట లక్ష్మీ నరసింహారావు) 'తెలుగు కవిత్వం - తీరు తెన్నులు' అనే అంశంమీద చాలా

## సినిమా పేరు ?

**సాగర మథనంలో - ఇదిమోహిని చేసిన నాట్యం**
**నవ రసాత్మకం - భువన మోహనం**

*గేయరచన : వేటూరి.... పాడినవారు : సుశీల*

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లు వేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

**మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : 20-9-1991**

చక్కగా ప్రసంగించారు. నరసరావు పేటలో నాయని సుబ్బారావు శిష్యులవటం, ఆ తర్వాత జాషువా ప్రభావం ఈయనపై పనిచేశాయి. 'భాషా, వస్తుతత్వం, శైలి - ఏ రచనకైనా ప్రధానం. పురాణ, ప్రబంధ, అంధ, నవీన యుగాలుగా మన కవితా సాహిత్యాన్ని విభజించవచ్చు. పురాణ ప్రబంధ యుగాలు మీకు తెలిసినవే. చంద్రలేఖ విలాసమా, విలాపమా, అన్నది అంధయుగం. ఇక, నవీన యుగానికి కందుకూరి, గిడుగు సూర్య చంద్రుల్లాంటివారు. అప్పట్లో కొత్తగా వస్తున్నదానికి భావకవిత్వం అని నామకరణం చేసినవారు గాడిచర్ల హరి సర్వోత్తమరావు. ఈ శాఖకు ఆద్యులు రాయప్రోలు సుబ్బారావు; అంతర్మథనానికి శృంగారమూ ప్రకృతీ తోడవుతాయి. కృష్ణ పక్షము, ప్రవాసము, ఊర్వశి - వీటిని కృష్ణశాస్త్రి ట్రయాలజీగా చెప్పుకోవచ్చు. కరుణశ్రీ, వేదుల, నండూరి - వీరందరూ పువ్వులు ఏమనుకుంటున్నాయో చెప్పినవారే! దోసెడు పారిజాతములు, మతోన్మాదానికి మారుగా నిలచిన శిలను అలంకరింపనని, పూలబాసలు తెలిసిన ఎంకి ఈవిధంగా.... ఆ తర్వాత శ్రీ శ్రీ 'కవిత్వమొక తీరని దాహం' - అన్నారు.... నాదృష్టిలో కవిత్వం రసోల్లాసాన్ని యివ్వాలే గాని రాజకీయ ప్రచారానికి పూనుకోకూడదు' - అన్నారు పివియల్ నరసింహారావు. అధ్యక్షులు కృష్ణమూర్తి ప్రధానవక్తను పరిచయం చేశారు.

28

జయా వేణుగోపాలరావు దంపతులు రాయలా నగర్‌లోని తమ మేడభాగం (కొత్తగా కట్టించినది) చూసేందుకు రమ్మనీ, భోంచేసి వెళ్లమనీ నిన్నరాత్రి ఫోన్‌లో పిలుపు. 'ఆదివారం మా డ్రయివర్ జోసఫ్ రాడే, మధ్యాహ్నమన్నా చెప్పారు కాదు' అన్నాను. 'మీ కెందుకదంతా? - ఎవరో ఒకరు తీసుకు వస్తారు మిమ్మల్ని. రాజాగారు యివాళే వచ్చారు - మళ్లీ ఎల్లుండి వెళ్లిపోతారు - ఆయన ఊళ్లో వుండగానే మనందరం కలుసుకోవాలి' - అన్నారు వేణుగోపాలరావు.... ప్రేమ్‌చంద్ దంపతులు వచ్చి మమ్మల్ని రాయలా నగర్ తీసుకువెళ్లారు. మేము నలుగురం గాక, రమణయ్యరాజా, బియస్సార్, భమిడిపాటి రాధాకృష్ణ; వేణుగోపాలరావు దంపతులు, వారి అబ్బాయి. శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రి, చెళ్లపిళ్ల వెంకట శాస్త్రుల కోట్రుదావా కథ రాధాకృష్ణ చెప్పారు. ఆ తర్వాత ప్రేమ్‌చంద్ జోక్స్. కొత్తగా కట్టిన అప్‌స్టయిర్స్ చూశాక భోజనాలు... భోజనానంతరం నా 'డైరీ' మీద దాడి ప్రారంభించారు. మొదట మాలతి అందుకుంది - వెనక శ్రీరమణ చెప్పిన శైలిలో. 'ప్రజంట్ చేసిన ఫ్లాస్కు ఆ అమ్మాయంత అందంగా ఉందని రాశారు. ఆ అమ్మాయి పేరేమిటి, బియస్సార్?' అని అడిగారు వేణుదోపాలరావు. 'సినిమా

వారిపేర్లు నాకేం తెలుసు - ఆయన్నే అడగాలి' - అన్నారు బియస్సార్. 'నాలుగైదేళ్ల క్రితం సంగతి నాకు మాత్రం జ్ఞాపకమా ?' - అన్నాను. 'మీకు జ్ఞాపకంలేదంటే నమ్ముతామా? మాలతిగారు పక్కనున్నారని ఆ అమ్మాయి పేరుచెప్పడంలేదు' - అని వేణుగోపాలరావు, నవ్వుల జల్లులో.... స్నేహార్ద్రతతో కూడిన యిటువంటి అతిథ్యాలూ, కమ్మటి కబుర్లు, కాలం పరుగులో చెరగని స్మృతులూ - యివే మా సంపద.

## 31

మైలాపూరు రసిక రంజని సభలో, అమలాపురం నుంచి వచ్చిన రేకపల్లి శ్రీనివాసమూర్తి పాట కచ్చేరీ. వృత్తి రీత్యా అడ్వకేటూ, రాజకీయంగా కాంగ్రెస్ వాది అయిన శ్రీనివాస మూర్తి 'రామా నీదయరాదా....' ఎంతో శ్రావ్యంగా గానం చేశారు. ఆంధ్రాలో చాలాచోట్ల పాడారుగాని మద్రాసులో యిదే మొదటిసారి అనీ, బివియస్సెస్ మణిగారు పూనుకోవటం వల్ల సాధ్యమయిందనీ, కచ్చేరీకి ముందు యిద్దరం మాట్లాడుకున్న యిష్టా గోష్టిలో చెప్పారు. గంభీర మైన గాత్రం, లోతైన సంగీత జ్ఞానంగల వ్యక్తి శ్రీనివాసమూర్తి.

—యన్నార్ చందూర్

# ముఖ చిత్రం



కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిందనీ, ఆ తర్వాత ఆంధ్ర ప్రదేశ్‌గా హైదరాబాదుకి వెళ్లిందనీ ఈనాడు చాలామంది మర్చిపోయి వుంటారు. అలా వెళ్ల డంతో, తెలుగు వారందరికి ఒక రాష్ట్రమంటూ ఏర్పడటంలో బూర్గుల రామకృష్ణారావుగారి పట్టుదల, త్యాగ నిరతీ చిరస్మరణీయమైనవి.... 1899 లో మహబూబ్ నగర్ జిల్లాలో జన్మించి, బొంబయిలో 'లా' చదువుకు హైదరాబాదులో న్యాయవాధిగా జీవి తం ప్రారంభించిన బూర్గుల, ప్రజా హితరంగంలో ప్రవేశించే నాటికి గ్రంథాల యోద్యమమూ, ఆంధ్రోద్య మమూ, నెమ్మది నెమ్మదిగా పెనవేసుకుపోతున్నాయి. నైజాం సంస్థానం భారత యూనియన్‌లో చేరాలనే తీర్మానాన్ని హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఆమోదించింది. పోలీస్ యాక్షన్ తర్వాత 1952 నుంచి 1956 దాకా హైదరాబాదు రాష్ట్ర ముఖ్య మంత్రిగా ఉన్న బూర్గుల, మౌలానా అజాద్‌తో అన్నారట: విశాలాంధ్ర స్థాపన రాజకీయంగా నాకు 'డెత్ వారంట్' అని తెలుసు. అయితే, ఈ కుర్చీ, ఈ పదవీ కంటె ప్రజలూ, ప్రజాక్షేమం ముఖ్యం.... కేరళ, యుపిలకు గవర్నరుగా పని చేసిన ఆ మహానుభావుడు, 1967 లో, కన్నుమూశారు. 



"After being installed on the throne of Kishkinda, Father, how could Sugreeva fail to honour his word? Was he afraid of the risk involved?"

"Not so. It was rainy season and he was having a jolly good time with his consorts. Fortunately for him, it was Tara that saved the situation" said Raghu's Father.

"How does she figure in? I do not quite understand," said Raghu.

"I 'll tell you. She has her plus points.... 'Go and tell Sugreeva that failure to abide by the promise given earlier amounts to deceit and misconduct punishable by death and destruction' - That was the message of Rama to be delivered by Lakshmana. Tara, with her abundant worldy wisdom, on seeing Lakshman with fury writ on the face, could very well imagine the consequences. With her tactful tender words and prayerful appeal, requested him to condone Sugreeva. And she admonished Sugreeva for his negligence towards a sacred duty, drowning himself in the pleasures of flesh. Immediately search parties were sent in all the four directions in pursuit of Seeta," explained Raghu's Father.

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*



# కొత్త పుస్తకాలు

'మాతృత్వం - ప్రసూతి' (సమస్యలు, సలహాలు). రచన: డాక్టర్ ఆలూరి విజయలక్ష్మి, ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001.... వెల: రు. 22-00,

గర్భం దాల్చగానే ప్రతి స్త్రీకి, తను ఒక్కతెను కాదు అనీ, తనతో బాటు తనలో మరొకరు వున్నారనీ అనిపిస్తుంది. మాతృత్వం మహిళకు ఒక ఆనందానుభూతి. అయితే, మన దేశంలోని పేదరికం, అవిద్య ఆ అనుభూతిని సక్రమంగా అర్థం చేసుకోగల అవకాశాన్ని యివ్వడం లేదు.... మొదటి పది వారాలలో శరీర ధర్మంలో అనేక మార్పులు సంభవిస్తాయి; నాలుగో నెలలో బిడ్డ కదలిక తెలుస్తుంది. చివరి మూడు నెలలు శరీర స్థితి ప్రసవానికి సంసిద్ధమవుతుంది.

గర్భాశయానికి యిరువైపులా వుంటాయి అండాశయాలు; అప్పుడే పుట్టిన ఆడపిల్ల అండాశయంలో అయిదు లక్షల అండకణాలు వుంటాయనీ, ఈ ఆడపిల్ల పెరిగి పెద్దదయాక, ఈ అయిదు లక్షలలో 400 అండకణాలు మాత్రమే ఆమె జీవితకాలంలో పరిణతి చెందుతాయనీ అందులో ఒకే ఒక్కటి 28 రోజుల కొకసారి విడుదల అవుతుందనీ వైద్య విజ్ఞానరీత్యా తెలుసుకున్నప్పుడు, ఈ సృష్టిలీల మరింత అద్భుతంగా కనిపిస్తుంది.

ప్రతి అండంలో 23 జతల క్రోమోజోమ్స్ వుంటాయి; అండము, కలిసి పిండంగా ఏర్పడ్డాక, దానిలోనూ 23 జతల వుంటాయి. ప్రతి క్రోమోజోమ్ పొడవునా వుండే సూక్ష్మాతి సూక్ష్మమైన 'జీన్స్' ద్వారానే వారసత్వ లక్షణాలు సంక్రమిస్తాయి.

గర్భందాల్చిన స్త్రీ తన భోజనంలో పిండి పదార్థాలు, మాంసకృత్తులు, కొవ్వు పదార్థాలు, లవణాలు, విటమినులూతో సమగ్రాహారం తీసుకుంటూ ఏడెనిమిది గ్లాసుల మంచినీళ్ళు తాగుతూ, అయిదో నెల దాకా నెలకొకసారి, ఆపైన పదిహేను రోజులకొకసారి, తొమ్మిదో నెల వచ్చాక ప్రతి వారమూ లేడీ డాక్టరుని సంప్రదించడం మాతా శిశువులిరువురికీ ఆరోగ్యప్రదం నేటి 'అల్ట్రా సౌనా

గ్రఫీ' శిశువు పెరుగుదలని స్పష్టంగా చూబుతుంది.

వ్యక్తిగతమైనా, ఆరోగ్య పరమైనా, కారణం ఎటువంటిదైనా, 'అబార్షన్' మూడో నెల రాకపూర్వం జరగాలి. కుటుంబ నియంత్రణ పద్ధతులలో మాత్రలకంటె 'లూప్' క్షేమకరం. గర్భవతులేగాక సామాన్య స్త్రీలుకూడా తెలుసుకోవలసిన సమాచారం, మాతా శిశు సంరక్షణ అంటే ఏమిటో దాని స్వరూపం, ఎంతో సరళమైన భాషలో తగు హెచ్చరికలతో చెప్పారు డాక్టర్ విజయలక్ష్మి.

—సుమతీ సాగర్

బొల్లి ముంత శివరామకృష్ణ కథలు. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్ 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 1.... వెల : రు. 16-00.

నవ్వించే కవ్వించే కథల సంపుటికి పరిచయం వ్రాస్తూ, 'సామాజిక వాతావరణమూ, రాజకీయోద్యమాల సంఘర్షణా, పోరాటాలూ సాహిత్యంలో చక్కగా చిత్రించే రచయిత గొప్ప కళావేత్త అయివుండాలి' - అన్నారు అవసరాల సూర్యారావు 1954 లో 'అంతరాత్మ అంత్యక్రియలు' పేరుతో వెలువడ్డ శివరామకృష్ణ కథా సంపుటికి ముందు మాటగా, ఆ కథానిక కూడా ఈ సంకలనంలో ఉంది. 31 కథలలో, పొట్టికథ 'స్వాతంత్ర్యం' వర్గ సమాజంలోని పత్రికా స్వాతంత్ర్యంపై సుతి మెత్తని దెబ్బ. పత్రికా రచయితల సంఘ సమావేశానికి అధ్యక్షత వహించి వచ్చిన సంపాదకుణ్ణి ఉద్యోగం నుంచి తీసేస్తూ యజమాని, 'స్వాతంత్ర్యం పవిత్రమైనదని అన్నారు కదా - మిమ్మల్ని వుంచడమా, మానిపించడమా అనే స్వాతంత్ర్యం నాకు లేదా?' అని అడుగుతాడు.

కాంతా సమ్మిత కథలలో 'హెూరం రూలూ' 'వేకువనే నిద్ర పొమ్మ' వ్యంగ్యాత్మక రచనలు. కాకరకాయ కూరలో బెల్లం బదులు పంచదార వేయడంవల్ల, అది కాకరకాయ హల్వా కాగా, ఈ వంటకం ఎలా చేయాలో పత్రికకి రాసి, ఆ పైన వంటలూ ఉత్తరాలా ద్వారా రచయిత్రి అయిపోయి, పొదుపు ఉద్యమ విజయానికి లాటరీ టికెట్లు కొంటూ, ఈ లాటరీల వల్ల సంఘానికి ఎంత హాని జరుగుతున్నదో పత్రికకు వ్యాసం వ్రాస్తుంది ఒక నారీమణి.

"చిటపట చినుకులు పడుతూ వుంటే - చెలికాడే సరసన వుంటే...." – రేడియో నుంచి పాట వినిపించడమే కాదు, చెలికాడు కారులో తీసుకు వెళ్లి, చలిని తట్టుకుందుకు కోటు కప్పుతాడు. బాంకులో పని చేస్తున్నానని చెప్పిన ఆ కమలాక్షిని ఇంటివద్ద దింపి, మర్నాడు బాంకులో కలుసుకు చెప్పుకోబోయే కబుర్ల గురించి కలలు కంటూ, పెట్రోల్ బంకులో టాంక్ నింపుకు జేబు చూసుకుంటే, పర్సు

వుండదు 'మైనస్ అబ్బాయి, ప్లస్ అమ్మాయి' కథలో.

చేప పెట్టెక్కడం, ముగ్గురు స్నేహితుల డిటెక్టివ్ (అద్దం, పాప, నిమ్మపండు), అమ్మమ్మ హితవు మున్నగు వ్యంగ్య రచనలు, రాజకీయ సామాజిక యితివృత్తాలు వున్నాయి ఈ కథా సంపుటిలో.

—క్షీరసాగరమ్

## ఈ మధ్య అందినవి :

ప్రజా సాహితి - సాహిత్యోద్యమ పత్రిక. వర్కింగ్ ఎడిటర్ : నిర్మలానంద.... దాసరివారి వీధి, విజయవాడ - 2.... రు. 8-00.

పోతుకూచి కథలు. జన చైతన్య ప్రచురణలు సికింద్రాబాదు - 3.... రు. 4-00.

భాగవత కథాసుధ - మొదటి భాగం - రు. 9-00 ; రెండవ భాగం - రు. 12-00.... పప్పు వేణుగోపాల రావు.... భాగవత తత్త్వ ప్రచార సమితి, కడప.

సహృదయ సాహితి - దశాబ్ది ఉత్సవ సంచిక. అధ్యక్షులు ; చిత్రకవి ఆత్రేయం విశాఖపట్నం - 16.

Concepts of Hinduism - Old and New by M. Ramakrishna Rao and the Relevance of India by Baldeo Sahai... Forum for Science and Culture, Madras - 35... Rs. 5-00.

Goda's Garland of Devotion by Prema Nandakumar. Samata Books, Madras - 6... Rs. 15-00.

వానజల్లు - అచంట శారదాదేవి కథలు.... సాహితి రచయితల సహకార సంస్థ, హైదరాబాదు - 35.... .... రు. 15-00.

## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడు - పి.బి. 2922
మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు

అడ్రసు

తేదీ : సంతకం

Jagati - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600 004

# చిత్రజగతి

## సమీక్ష

### శ్రీదేవీ మూవీస్
### 'ఆదిత్య - 369'

యస్పీ బాలసుబ్రహ్మణ్యం సమర్పించిన ఈ చిత్రానికి దర్శకులు సింగీతం శ్రీనివాసరావు. నిర్మాత : అనితా కృష్ణ. హీరో : బాలకృష్ణ. హీరోయిన్: కొత్తనటి మోహిని.... సైన్స్ ఫిక్షన్‌లో 'టైమ్ మిషన్' భావన హెజ్‌జి వెల్స్‌ది అయినప్పటికీ (అప్పటికింకా రాడార్, కంప్యూటర్, అంతరిక్ష యానం లేవు), జార్జి లూకాస్ తీసిన స్పేస్ ఒడెస్సీ, స్టార్‌వార్స్, ఎంపైర్ స్ట్రయిక్స్ - సినీ ప్రేక్షకులని విభ్రాంతులు గావించాయి. ఆర్థర్‌క్లార్క్ సంప్రదింపుతో నిర్మించిన 'స్పేస్ ఒడెస్సీ' ఒక్కటే కొంచెం సబబూ సందర్భం కలిగివుంది. రీగన్ కాలం నాటి అంతరిక్ష పరిశోధనలు 'స్టార్ వార్స్' కి విజయం చేకూర్చిపెట్టాయి. 'ఎంపైర్ స్ట్రయిక్స్' తేలిపోయింది. ఇటువంటి తమాషాలు అప్పుడప్పుడు హర్షిస్తారుగాని అదేపనిగా ఆమోదించరు. ఏ కళాస్వరూపానికైనా వాస్తవికతా న్యాయం జీవధాతువు. దర్శకులు సింగీతం శ్రీనివాసరావు ఈచిత్రంలో ఒక వినూత్న ప్రయత్నం చేశారు.... మ్యూజియమ్‌లోని వజ్రాన్ని, రాజావర్మ (అమ్రేష్‌పురి) మనుషులు అపహరించడం కళ్లారాచూసిన ఒక బాలుడు, కృష్ణకుమార్ హేమల ప్రేమాయణంలో కాసేపు సంధానకర్త అయి, తన బాలబృందంతో టైమ్ మెషిన్‌లో (కాలయంత్రం) యిరుక్కోగా, వారిని రక్షించి, వేరువేరు మీటలు నొక్కడం వల్ల, నాయికా నాయికలు భూతకాలంలోకి పయనిస్తారు. హంపీ విజయనగర వీధులలో విదూషక పాత్ర, కాలయంత్రంలో మూర్ఛిల్లిన కానిస్టేబుల్ వేలుది-రాజనర్తకి (సిల్క్ స్మిత) సాయంతో, అష్టదిగ్గజాలువున్న శ్రీకృష్ణదేవరాయులు ఆస్థానంలో ప్రవేశిస్తారు కృష్ణకుమార్, హేమ. రాయలవారు మన బాలకృష్ణే. నాలుగు శతాబ్దుల వ్యత్యాసంవల్ల కావల్సినంత డ్రామా, 16వ శతాబ్దిలో బయలుదేరిన కాలయంత్రం 20వ వద్ద ఆగక, 24 దాకా పోతుంది. ఫొటోగ్రఫీ అద్భుతమూ అద్వితీయమూను. విస్మయానందకర సన్నివేశాలతో మిమ్మల్ని ఆశ్చర్యచకితులుగావిస్తూ కుర్చీకి కట్టేస్తుంది.... పి ఆర్ ఒ : అంజనేయులు.



సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత



గడిచిన కథ : సివిల్ ఇంజనీరు విశాలకు, డాక్టరు నాగార్జునకు పెళ్లి నిశ్చయమయింది - ఒకరి మీదొకరికి ఎంతో అభిమానం. లావణ్య కేవలం పేషంటు మాత్రమే. విశాల సోదరి విమ్మి, దుర్మార్గుడైన రాజేష్‌తో, బీరువాలోని నగలన్నిటితోను పరారికావడం, కొత్త సమస్యలు తెచ్చిపెడుతుంది. అదలా వుండగా, విశాలనెవరో నిర్బంధించి ఎత్తుకు పోతారు.... ఇక చదవండి

వరండాలో ఎవరో వెళుతున్నట్లు కిటికి అద్దంలో నుండి నీడ పడింది. కిటికీ మూసివుంది.... దానికి గడియ వేసినట్లు లేదు.... కిటికి గడియ వేయటం మరచిపోయి వుంటాడు. అది తన పాలిట వరం. కడీలు లేని కిటికి, ఈజీగా దాటి వెళ్ళిపోవచ్చు. కాని,.... ఈ కట్టివున్న కట్లు ఎలా విడిపించు కోవాలి? ఎవరు విడిపిస్తారు....? ఎవరి సహాయం లేనిదే తను ఎలా వెళ్ళగలదు? తను ఇక్కడ ఉన్నట్టు తెలిసేదెలా ...? అరవాలన్నా నోటిలో గుడ్డలు. ఒళ్ళంతా - ళ్ళ మోకాళ్ళ దిగువనుండి తాళ్ళులేవు. నెమ్మదిగా కాలెత్తి కిటికి మీద పెట్టింది. కిటికి తలుపు కొంచెం తెరుచుకుంది; ఇంకొంచెం నెట్టింది. బాగా తెరచుకుంది. ఇప్పుడు వరండా లోకి ఎవరొచ్చినా ంది. నోటితో శబ్దం చేసేందుకు వీలుకాక, కాళ్ళతో నేలమీద శబ్దం చేసింది. ఎవరో అటు వచ్చారు. కాని విమ్మిని గమనించలేదు.... అక్కడున్న చిన్న పెట్టెను కాలితో దగ్గరకు లాక్కుని దాని మీద.... కాలితో శబ్దం చేసింది .... అలాగే చేస్తూవుంది. ఆ చిన్న పెట్టెలోని సామానులు కూడా కదలి శబ్దాన్ని కలిగిస్తున్నవి.... ఎవరో నడి వయస్సు వ్యక్తి చూశాడు.... అయినా వేగంగా వెళ్ళిపోయాడు. అందులో ఇది చివరి రూమ్ అవటం వలన, ఎక్కువ మంది.... యిటు రావటం లేదు. నిరీక్షిస్తోంది విమ్మి. ఎవరూ కనిపించలేదు. ఒకవేళ ఇంత లోనే రాజేష్ వచ్చేస్తే, తను బయట పడటమంటూ వుండనే వుండదు.

శమ్మి జీవితాన్ని కళ్ళారా చూసి కూడా, తనూ ఆ దారిలోనే నడిచి ప్రాణం మీదకు తెచ్చుకుంది..... ఇంతలో.... ఒక పదేళ్ళ పాప ఆడు కుంటూ అటు వచ్చింది. తక్షణం విమ్మి .... ఆ పెట్టెని .... శబ్దం చేసింది. ఆ అమ్మాయి తిరిగి చూసింది. భయంతో కళ్ళు పెద్దవి చేసి ఏదో

దెయ్యాన్ని చూచి భయపడుతున్నట్లు గుండెలమీద చేతులుంచుకుంది.

విమ్మి ఆ పాపని.... దగ్గరకు.... రమ్మని సైగ చేసింది. ఆ అమ్మాయి విమ్మి దగ్గరగా వచ్చేందుకు రెండడు గులు ముందుకు వేసి .... ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఠక్కున ఆగి పోయింది.

దగ్గరకు వస్తుంటే ఆశగా చూచిన విమ్మి.... అలా ఆగిపోయేసరికి నిరాశ పడి మళ్ళీ పిలిచింది.

ఆ పాప వెనుక్కు తిరిగి పరు గెత్తింది.

ఆ వెళ్ళిన పాప తన తల్లిని వెంట పెట్టుకుని వచ్చింది.

ఆమెను చూస్తూనే రవ్వంత ఆశ జనించింది - విమ్మిలో.... ఆమె విమ్మి దగ్గరగా వచ్చి.... పరీక్షగా చూచింది.

నోటిలో కుక్కిన గుడ్డను తీయ మన్నట్టుగా సైగచేసింది విమ్మి. ఆమె ముందు సందేహించినా చివరికి ఆ గుడ్డను తీసి క్రింద పడేసింది

"అమ్మా మీ మేలు జన్మలో మరచిపోలేను. మీరు దైవంలా.... వచ్చారు" అంది విమ్మి కృతజ్ఞతగా.

"ఎవరు.... ఎందుకిలా కట్టేశారు" అడిగింది ఆమె.

"మా అత్త కొడుకు రాజేష్ నన్ను పెళ్ళి చేసుకుంటానని తీసుకొచ్చి, నన్ను ఇక్కడ బంధించి, ఇంట్లో నుంచి తెచ్చిన డబ్బు పట్టుకు వెళ్ళిపోయాడు .... నన్నిలా కట్టిపడేసి.... దయచేసి నన్ను బంధ విముక్తిరాల్ని వేయండి" కన్నీళ్ళతో బ్రతిమలాడింది విమ్మి.

విమ్మిని చూస్తే జాలికలిగిం దామెకు "నీ పేరేమిటి" అడిగింది.

"విమల"

"చూడు విమలా పెళ్ళికాని పిల్లవు .... ఇలా ఇల్లు వదలి రావటం ఎన్ని కష్టాలకు కారణమవుతుందో ఆలోచించావా....?"

"చేసిన తప్పుకి ఫలితం అనుభ విస్తున్నాను"

"మన జాగ్రత్తలో మనం వుండా లమ్మా! ఉండు ఒక నిముషంలో వస్తాను" అంటూ వెళ్ళిందామె.

అన్నట్టుగానే వచ్చి.. బ్లేడుతో కట్లు తెంచింది.

విమ్మి ముఖం విప్పారింది.

"అమ్మా! మీ మేలు జన్మలో మరచిపోలేను."

"నా మేలు కాదు.... తీసుకున్న నిర్ణయం మంచిది కాదని .... తెలుసుకో. మాయ మాటలు నమ్మిన ఆడపిల్లలు నీలాగే యిరుకున పడతారు. ఇక్కట్లు ఎదురైనప్పుడు, కన్నీళ్ళూ ఆత్మహత్యలూను. ఏ ఆత్మీ యుల ఆధారం లేకుండా, పరపురుషు డిని, నమ్మి కాలు బయట పెడితే, జరిగేది యిదే!"

బంధ విముక్తురాలైన విమ్మికి ఆమెపై ఆరాధనా భావం కలిగింది. తొలిసారిగా అహం కప్పెట్టి, అంత సహాయం చేసిన ఆమెకు పాదాభి వందనం చేసింది. (ఇంకా వుంది




JAGATI Telugu Monthly - Vol. 36 - No 422 - SEPT 91

Edited, Printed and Published by N. R. Chendur at MANASA PRESS, 2 Kutchery Road, Madras - 600 004

Phone: 76697